# సీతారామము.



శ్రీమతి కలగర అన్నపూర్ణాదేవి గారిచే

రచియింపఁబడినది.





ప్రకటన కర్తలు :

అన్నపూర్ణాదేవి స్మారక సంఘము.

పి కై రోడ్, బెజవాడ.

 [వెల 0-12-0

# మ న వి.



అన్నపూర్ణాదేవి వివాహమునకు పూర్వమే తన 16వ యేట నీగ్రంథమును రచియించి యుండుటచే, తద్విషయము పాఠకుల కెరుకపఱచు నుద్దేశ్యమున 'మాగంటి అన్నపూర్ణ' అని వ్రాయక, కలగర అన్నపూర్ణ యని వ్రాసి యుంటిమి. గమనింతురు గాక!

స్మారక సంఘము.



శ్రీ ర స్తు

# సీతారామము.

బాలరామాయణ మను నామాంతరము గల

ఈ అభినవ గద్యకావ్యము

శ్రీమతి కలగర అన్నపూర్ణాదేవి గారిచే

రచియింపఁబడినది.



ప్రకటన కర్తలు:

అన్నపూర్ణాదేవి స్మారక సంఘము,

పిన్నై రోడ్, బెజవాడ



[వెల 0-12-0

Sixth Edition 1000
Total 7000 Copies.




బెజవాడ
కామేశ్వర బ్రదర్సు వారి
శ్రీ బాల సరస్వతీ ముద్రాశాలలో
తిపిర్నేని వీరరాఘవయ్యా చౌదరిగారిచే
ముద్రింపఁబడియె.

ఆఱవ కూర్పు ౧౦౦౦
మొత్తము ౭౦౦౦ ప్రతులు

*To*

***Her Beloved Parents***

*M. R. Ry. K. Ramaswamy Chowdary Garu*

AND

*Sreemathi Pitchamma Garu*

**This Book is Dedicated**

**As a TOken of LOve and DevOtion**

**To the Care Taken**

**In Liberally Educating Her.**

THE AUTHORESS.

ఈ గ్రంధమును

నా ప్రియజనకుడు మహారాజశ్రీ

కలగర రామస్వామి చౌదరి గారికిని

ప్రియ జనని

శ్రీమతి కలగర పిచ్చమ్మ గారికిని

ప్రేమ పురస్సరముగా

అంకితము చేయుచున్నాను.

అన్నపూర్ణాదేవి.

అన్నపూర్ణాదేవి స్మారకసంఘ అభివందనములతో

" నన్ను మరచినను మాతృదేశమును మరువవద్దు " అ. దేవి.



మాగంటి అన్నపూర్ణాదేవి.

జననము 10—3—1900. మరణము 9—10—1927.

Coimbatore.

19. 10. '27

My dear Friend,

Good Narayan Raju sent me a wire on Monday about the passing away of Annapurna & now I have the letter he informed me of. I knew nothing of this sad event. I had inquired about her only the other day of [illegible] & he told me she was ailing as usual [illegible]. The wire therefore stunned me.

If you have lost a dear wife I have lost a dearer daughter. I don't mind your rebuke. You are entitled to chide me, to chide fate herself in your irreparable loss. But I ask you to share my belief that Annapurna

whom you loved & I loved is not dead. Her imperishable soul must be, now that she cannot speak through her body, a greater reminder of our respective duttes. & I do hope that you will follow in her footsteps & carry out her many noble wishes.

You ask me to give my name to the proposed committee. I may not do so for the simple reason that I have many daughters both dead & living. It would be too great a burden for me to carry if I began to become a member of committees proposed to perpetuate their names. I must be satisfied with the endeavour to become worthy of so many noble daughters. I am writing [illegible] in 4 9.

M.K. Gandhi

# Introduction.

I have perused with great pleasure Miss. K Annapurna Devi's "Sitharamam." It is really a matter of great admiration that a lady belonging to the Kamma community should write such a beautiful life of our national Hero and Heroine the immortal Rama and Sita. In this book the story of Ramayana is told in a style, which will appeal even to the school boy and yet is very chaste and idiomatic. I am sure that this story book will catch the ear of the Telugu Public and will soon be very popular.

As a brother of the late lamented Atchamamba Garu, Authoress of the "Lives of Noble Women," I have been taking special interest in watching the progress of female education in the Telugu country and it was a very agreeable surprise to me to find such fine production from the pen of a young lady from the District of Kistna. I can recommend this as a Text-book for High School and College Classes.

I am glad to find the book well edited and neatly got up. The Editor seems to have taken special care to see the book free from usual printing mistakes and this is certainly a great relief to the general reader.

The gifted authoress has studied upto the Matriculation standard and is well acquainted with the Bengali Literature, as she prosecuted her studies at Calcutta for a long time. I hope the authoress will be encouraged by the patronage of the public, the University and the Educational authority and I am sure there is a great future before the budding authoress, if she continues in her literary activities.

K. V. LakshamanaRao, M. A.,
Dewan of Munagala,
Editor - in - chief of the Telugu
Encyclopedia
and
Editor of the Vignana Chandrika Series.



శ్రీ వాయుగుప వేనమః

చిట్టిగూడూరు.
20-4-30

ఆర్యా,

మీరచించిన సీతారామ మను గ్రంథము నామూలాగ్ర ముగఁ జదివితిని. అందలిది శ్రీరామ చరిత్ర యగుటచే నిది బాలుర కెంత నీతిదాయకమో నేను గ్రొత్తగ వ్రాయఁ బని లేదు. ఆంధ్రవనితారత్నము కీ॥ శే॥ శ్రీమతి అన్నపూర్ణాదేవి గారీ గ్రంథము నింత లలితమగు భాషలో రచించి భాషాసేవ యొనరించుట కడుంగడు ప్రశంసనీయము. కథాసంగ్రహము నను న్యూనతాతి ప్రసక్తి దోషములు లేకుండఁ గడు సులకువతో రచించిన యీమె నైపుణ్యము ప్రత్యేక ప్రశంసా పాత్రము. ఈ గ్రంథ మన్నివిధముల బాలుర కత్యంతోప కారకమగునని నా నమ్మకము.

చిత్తగింపుడు.

విద్వాన్ దువ్వూరి వెంకటరమణశాస్త్రి.

Telugu Pandit,
Narasimha Sanskrit College, Chittigudur,
Member of the
Senate, Academic Council &
the Board of Studies in Telugu,
Andhra University.

---

# విజ్ఞాపనము

ఆర్యులారా !

నేను షట్కాండములు గల "సీతారామాయణము" అను రామాయణము నాకుఁ గల శక్తి కొలంది నాంధ్రమున బాలికలకును, బాలురకును పఠనార్హముగ నుండు నను తలంపున రచియించి కొందఱు పండితులకు జూపి వారి యభిప్రాయ మడిగితిని. వారు సాంతముగఁ జదివి యిది యని యాబాలగోపాలమును బఠించుట కనుకూల యుండు ననియు, ముద్రింపించినచోఁ బాఠశాలలందుఁ బఠన గ్రంథ నిర్ణయాధికారులచేఁ బఠనగ్రంథముగ నియమింపఁబడు ననియుఁ జెప్పి తమ యభిప్రాయములను లిఖితమూలకముగ నొసంగిరి. అందువలన నాకును దీనిం బ్రచురింపవలె నను నుత్సాహము కలిగి ప్రకటింపించితిని. గుణ గ్రహణపారీణులగు మీరీ గ్రంథమునందలి దోషములను గప్పిపుచ్చి గుణములను వెల్లడించి నన్నుం గృతార్థురాలిని జేసెద రని వినయ విధేయతలతో విన్నవించుకొనుచున్న దానను.

అన్నపూర్ణాదేవి.

శ్రీరస్తు.

# సీతారామము.

## మొదటి ప్రకరణము.



శ్రీలం బెంపొందుచుఁ జిరకాలమునుండి ధన ధాన్య సమృద్ధి నొందిన భరతవర్షమునందు సరయూ నదీతీరమునఁ గోసల మను దేశము గలదు. దానికి ముఖ్యపట్టణ మయిన యయోధ్యానగరమును దశరథుం డను మహారాజు న్యాయ మ్మునఁ బరిపాలనమ్ము సేయుచుఁ బ్రజలను సర్వ విధముల సంతోష పెట్టుచుండెను. పూర్వ మయోధ్య యనంబడు రాజ్య మిప్పుడు "అవుధ్" నామధేయమున వెలయుచున్న యది. పురసౌధములును, కోటలును నాకసమునఁ దేజోమయ ముగఁ బ్రకాశించుచున్న దినకరునిఁ జల్లని కిరణజాలంబులఁ బ్రసాదించు రజనీనాథుఁడైన శశాంకుని నంటుచున్నవో యనున ట్లుండెను. వేదవేదాంగ పారంగతులును, శాస్త్ర వేత్తలును, ధర్మ మార్గావలంబులును నగు వసుధామరుల తోడను, బలపరాక్రమశాలులగు వసుమతీ నాథులతోడను, బహు ధనసంపన్ను లగు వైశ్యశిఖామణుల తోడను, భక్తి ప్రపత్తులు గలిగి ధర్మకార్యాచరణపరాయణులైన కృషీవలు లైన క్షత్రియ, శూద్రులతోడను ఆ పురంబు కరంబు విరాజిల్లు చుండెను. అప్పురంబునఁ బేదవారును, రోగులును, అకాల మరణంబుం గాంచువారును, విపత్పరంపరల మునుంగు వారును

గాన నారు. పతినె దైవంబని నిరంతరంబు భావించుచుం బూజించెడు సాధ్వీమణులతో ఆ పురంబు నాకలోకముం దిరస్కరించుచుండెను. శిల్పనైపుణ్యమునం జెన్నొందు దేవాలయంబులతోడను, సురభివాసనములతో నిండి చల్లని నీడలిచ్చు మామిడితోటలతోడను, పొడవైన వీధులతోడను, విశాలంబులగు ప్రాంగణంబులతోడను, ధనురాకార తోరణంబులతోడను దుగ్ధవర్ణ శిలాఫలక నిర్మితంబులగు కుడ్యంబులు, వేదికలు, సోపానంబులు గల సౌధంబులతోడను మిగుల సొగసుగ శోభిలుచుండెను. అచ్చటి యశ్వంబులు, గజములు మొదలగు వాని సంఖ్యయుం బ్రాశస్త్యంబును జెప్పం దరంబుగాదు. ఆహా! ఇట్టి సకల భాగ్యంబులం దులందూగుచున్న యన్నగరంబు నేలు రాజెట్టివాండై యుండవచ్చునని చెప్పనొప్పు! అతండు బుద్ధిమంతుండును, కీర్తిమంతుండును, న్యాయవంతుండును, గుణవంతుండును, దుష్టశిక్షకుండును, శిష్టపరిపాలకుండును, సాధువర్తనుండును, అనాధనాధుండును, సత్యవ్రతుండును, మానధనుండును, ధర్మశీలుండునై సకల రత్నగర్భ యగు రత్నగర్భను నిష్పక్షపాతబుద్ధిం బాలించుచుండె. అతని పాలన కాలమున నే విధమయిన యన్యాయ కార్యంబులును జరుగవని మన మతని స్వభావమువలననే తెలిసికొనవచ్చును. అట్టిమేటి జెడు గొన్నండు నతని పరిపాలనంబునం బ్రాపము దనుట యొక విశేషంబులోనిది కాదు. అందఱు బాగుగ నుండి సంతృప్తిగ భుజించి మంచి గృహముల నివసించి సంతోషముగం గాలముం గడపుచుండెడివారు. దశరథుండు

ప్రజల వాఁడఁగును బుత్ర్రవాత్సల్యమునఁ బ్రేమించు చుండుట వలన వారు నాతనిం గన్న తండ్రివలెఁ బ్రేమించి యతని మాట జవదాఁటకుండెడివారు. అట్టి రాజన్యుండు మఱి యే కాలంబునం గాన్పింపఁడు. అయ్యయోధ్య నిట్టి సుఖములం దులఁదూఁగుచున్నను ఆ నృపుని ముఖారవిందంబున సంతోష చిహ్నంబు లెవ్వియుఁ గానరాకుండెడి.

విశాలరాజ్యము సత్ప్రవర్తనులగు ప్రజలు మున్నగు సౌకర్యంబు లెన్ని యున్నను, అతని కొక్క విషయమునఁ జాల కొఱంత యుండెను. అది యేదో మీకుఁ దెలియునా? అతఁడు సంతానహీనుఁ డగుటవలనఁ జాల దుఃఖించుచుండెను. ఆ నృపవర్యుని యనంతరము రాజ్యభారమును వహించుటకుఁ బుత్రుం డొక్కండు లేకుండుటయే గొప్ప కొఱంత. కులగురుఁడైన వశిష్ఠ మహామునికిఁ దన దుఃఖం బంతయు విన్నవించి సంతానంబు గలుగుటకై యేదేని యొక యుపాయంబు నెఱింగింపుఁడని యతఁడు పరిపరి విధంబులఁ బ్రార్థించె. అమ్మునిపుంగవుండు కరుణారస పరిపూర్ణ హృదయుండై "రాజేంద్రా! శాంతాపరుండైన ఋశ్యశృంగ మహామునిం గొనివచ్చి యాతని కనుమతంబుగ భక్తితోఁ బుత్రకామేష్టి యను యజ్ఞంబుం జేసిన యెడలఁ దప్పక పుత్రలాభంబుం బొందెదవు" అని పలికె. అంత నా రాజేంద్రుఁ డత్యానందమున నుప్పొంగుచు ముని యాజ్ఞం గైకొని ఋశ్యశృంగుం దోడ్కొని వచ్చుటకు సంకల్పించు

కొనెను. తన మిత్రుండైన లోమపాదుని కొమార్తెయగు శాంతను ఋశ్యశృంగుండు వివాహమాడెను. ఋశ్యశృంగుండు తన మిత్రుని కల్లుం డగుటవలనఁ దాని లోమపాదుని రాజ్యమైన యంగదేశంబునకుంబోయి ఋశ్యశృంగుని వినయంబుగఁ దోడ్కొనివచ్చి యతఁడు యజ్ఞమారంభించెను.

ఈ యజ్ఞారంభమున నశ్వమేధయాగంబు సేయవలసి యున్నందున, దశరథుండు తొలుదొల్ల దానిం జేయఁ దొడంగె. అశ్వమేధ యజ్ఞమన నశ్వమాంసమున యజ్ఞంబొనర్పవలయు నఁట! ప్రథమమున మంచి యంద మయి నట్టియు, బలము గలట్టియు నొక తురంగంబును దేశంబుల వెంట విడిచిరి. ఎవరుం దాని నిర్బంధింపకుండునటు లశ్వారోహకులును, శస్త్రాస్త్రధారులును దానిని వెంబడించి సంరక్షింపం బంపఁబడిరి. వారు దానిని సంవత్సరములోపుగఁ బ్రపంచంబునం గల నానా దేశములు ద్రిప్పి పరరాజుల వశంబు గాకుండ మరల నయోధ్యకుం దీసికొని వచ్చిరి.

అంతలోఁ బవిత్రమైనట్టియు, హిమవత్పర్వతమును, జననిగఁ జేసికొనినట్టియు, బాపుల సుకృతవంతులుగ నొనర్చునట్టియు, నుత్తర హిందూస్థానమును సస్యశ్యామలగఁ జేసి యచ్చటివారిని ధనవంతులుగ నొనర్చునట్టియు గంగానదీ తీరంబున నానావిధ కర్మకరులు యజ్ఞవాటికను బహు చమత్కారముగ సిద్ధపఱుప దొడఁగిరి. యజ్ఞవీక్షణార్థము నానా దేశరాజన్యులును, వేలకొలంది బ్రాహ్మణులును, ఋషులును,

తదితర జనంబులును ఎందఱెందఱో వచ్చియుండిరి. మిథిలాధీశుండగు జనకుండును, అంగదేశేశ్వరుం డగు లోమపాదుండును దశరథ మిత్రులగు మగధ వంగ కళింగాది దేశాధిపతులందఱును విచ్చేసిరి.

మహావైభవంబున యథావిధిగ నశ్వమేధయాగముం బూర్తిచేసిరి. జన్నంబు సమాప్తి నొందిన కొన్ని దినంబుల వఱకును బ్రాహ్మణాది జనంబులు సంతృప్తిగ భోజనములు చేసి మహారాజు నాశీర్వదించు చుండిరి. ఆ సమయమం దెక్కడఁ జూచిన సర్వ మానందమయంబై యుండె.

ఈ సవనంబు ముగిసినతోడనే పుత్రకామేష్టి చేసినంగాని పుత్రులు గలుగ రని ఋశ్యశృంగుఁడు పంక్తిరథునకుం జెప్పి యయ్యజ్ఞంబు జేయించె. ఆ యజ్ఞ సందర్భమున హవ్యవాహనుం డొక పాయస కలశమును హస్తంబున ధరించి మిక్కిలి సంతోషముతో నగ్నికుండంబునుండి వెలువడి దశరథునకుఁ బ్రత్యక్షంబై "ఇది దైవ నిర్మిత మయిన దివ్య పాయసము. దీనిని భక్షించిన శీఘ్ర కాలంబుననే సుపుత్రులంబడసెద" వని చెప్పి కలశం బిచ్చి యంతర్హితుం డయ్యె.

అట్టితఱి దశరథ రాజన్యుని యానందంబునకు మేర యుండునా? అమ్మనుజేశ్వరుం డుప్పొంగి యా పాయసంబును భక్షింపుం డని తన రాణుల కొసంగె.

పూర్వము రాజు లేక పత్నీవ్రతులు గారు. వారికి వందలకొలంది భార్య లుండెడి వారు. ఈ దశరథ రాజేశ్వ

రునకుం గూడఁ బలువురు పత్ను లుండినను ముఖ్యు లగు పత్నులు మువ్వురే.

ఆ ముగ్గురిలో మొదటి భార్య కౌసల్య; రెండవ భార్య సుమిత్రి; మూఁడవ భార్య కైక. కౌసల్య పట్టపుమహిషి; కైక కనిష్ఠ భార్య యగుట వలన రాజున కామెయందుఁ బ్రేముడి మెండు. పట్టపుమహిషి యను గౌరవంబునఁ గౌసల్య కప్పాయసంబున సగంబును, ముద్దు భార్య యగుటం జేసి కైకకు సగంబు నొసంగెను. సుమిత్రి కించుకంతయు నీయని కతంబునఁ గౌసల్యా కైక లిరువురు ముదంబునఁ దమపాయసంబున సగపాలు సుమిత్రి కొసగిరి. ఆ పాయసంబును భుజించిన వెంటనే మువ్వురును గర్భములు ధరించిరి.

దశరథునకు హృదయానందంబు దినక్రమంబున వృద్ధి యగుచుండఁ, దత్పత్నుల యుదరంబులందు బాలకులును మాసక్రమంబున వృద్ధి నందుచుండిరి. కౌసల్యా సుమిత్రా కైకలు అగ్ని దేవుం డొసంగిన మధురం బగు దివ్యపాయసంబును భక్షించిన నోళ్ళనే మన్ను దినఁ దివురుచుండిరి. ఎట్టి మహోత్తమ పదార్థం బయిన జిహ్వకు రుచ్యంబు గాకుండె. గమనంబులు మందమయ్యె. ఆవులింతలు మెండయ్యె. దౌహృద చిహ్నంబు లవయవంబుల నన్నింటఁ గన్పట్టదొడంగెను. అయోధ్యా నగరమందలి జనముల కెల్ల హర్షంబు దినదినప్రవర్ధమాన మగుచుండెను. దాసదాసీజనంబులు సంతసముతో దినములు, మాసములు లెక్క పెట్టుచుండిరి. వృద్ధ

బంధునారీజనంబులు దినదినంబును గొత్తక్రొత్తలగు వివిధ మధుర పదార్థంబులఁ జేయించి యొసంగుచుండిరి. ఆస్థాన వైద్యులు గర్భిణుల జీర్ణకోశంబుల నెట్టి వ్యత్యాసంబును బుట్టకుండ గట్టి కట్టడలు సేయుచుండ, నవమాసములు నిండి దేవతలం బోలు కుమారులఁ గౌసల్య యొకనిని, సుమిత్ర యిరువురిని, కైక యొకనిని మధుమాసంబునఁ బ్రథమ పక్షం బునం గనిరి

ఈ శుభ వార్త దశరథునకుం దెలిసి యతఁ డతులితా నంద హృదయుఁడై కులగురుండైన వసిష్ఠ మహామునిచేఁ దనూ జాతులకు జాతకర్మంబులు జను లుల్లసిల్లునట్లు చేయించె. కౌసల్యకుం బొడమిన కుమారునకు రాముఁడనియు, సుమి త్రికుం బుట్టిన పుత్త్రులకు లక్ష్మణ శత్రుఘ్నులనియు, కైకకు జన్మించిన కొమరునకు భరతుఁ డనియు నామంబు లిడిరి.

ఈ నలువురు పుత్త్రులును సౌందర్యమున నేమి, గుణము లం దేమి సకల విషయంబులందును అద్వితీయులై తేజోవంతులై దినదినాభివృద్ధి నందుచుండిరి. మంచి బాలుర కుండఁ దగిన గుణము లన్నియు వారియందుండెను.

శీఘ్రకాలములోనే వారు సకల విద్యలందును, వన విహారమందును అసమానులైరి. మఱియు వారి సోదర ప్రేమ మనిర్వాచ్యము. రామ లక్ష్మణులును, భరత శత్రుఘ్నులును పరస్పర ప్రేమాధిక్యమున నుండెడివారు. వారి యనురాగ వర్తనంబులు గాంచి యందఱు నత్యానంద పరవశు లగు

చుండురు. పుత్త్రులు కుపనయనంబులు గావించి పితృభక్తి పరాయణులగు ప్రియసుతులతో దశరథుండు మిగుల నానందమునఁ గాలక్షేపఁబు సేయుచుండె.

ఇవ్విధంబున ధర్మరతుండగు దశరథ సార్వభౌముండు ధరణిం బాలించుచుండ, ఖరకర తేజుఁడయిన కౌశికుం డను మహాముని మహారాజును దర్శింప నేతెంచె విశ్వామిత్రుండు చాల గొప్పవాఁడు, మిక్కిలి కోప స్వభావము గలవాఁడును. అతనివంటి తపశ్శాలులును, ప్రభావశాలులును ఇలాతలంబున నెందును లేరు. ఆ ముని స్వభావంబుఁ దెలిసిన వాఁడై త్వరితముగ నా వసుధాధినాథుఁ డచ్చపు భక్తితో నర్ఘ్యాదికంబు లొసంగి యతనిఁ దృప్తుం జేసెను. "మీరు మా భవనమున కేతెంచి మమ్ము ధన్యులం జేసితిరి. మీ రాకకు మే మందఱ మతులితానంద భరితుల మైతిమి. మీ రెందుల కేతెంచితిరో తెలియఁబలికిన, నేనా కార్యమును శిరసావహించి నిర్వహించుటకు సంసిద్ధుండనై యున్నాఁడను" అని దశరథుఁడు పలుక, "ఓ మహారాజా! నా కోరిక యేమి యన దుర్మార్గులగు మారీచ సుబాహు లను రక్కసులు గలరు. వారిని వధించి బ్రాహ్మణుల యజ్ఞములఁ గాపాడి పుణ్యము గట్టికొనుటకు మహావీరుఁడైన రాముని బంపుము. రాముఁడు గాక యితరు లెవ్వరు నీ కార్యంబు నెఱవేర్పఁజాలరు. నీ కేమియు భయంబు వలదు. రాముని దప్పక పంపఁ గోరెద" నని విశ్వామిత్రుఁడు మాఱుపల్కెను.

దశరథుం డమ్మౌని ధనకాంక్షం జెందియుండె నేమో యనుకొనెనే కాని యిట్టి నిష్ఠురంబగు కోరికం గోరునని యెంచలేదు. ఇయ్యది వినినంతనే యతం డేమియుం జెప్పంజాలక భయభ్రాంతుండై మూర్ఛ మునింగి కొండొక తడవునకుం దెలివిం గాంచి వణంకం జొచ్చెను. వసిష్ఠుండు “రాజేంద్రా! కౌశికునితోం బంపిన నీ కుమారున కేయపాయము ఘటిల్ల” దని యభయ మిచ్చి యోదార్చెను. వసిష్ఠుని మాటలవలనను, కౌశికముని శాపభయంబునను ఎట్టకేలకు దశరథుండు రామునిం బంపుట కొప్పుకొనెను. మఱియు, రామునకు సహాయంబుగ లక్ష్మణునింగూడం బంపుటకు నిశ్చయించుకొని కుమారులను విశ్వామిత్రుని వెంటం జనుండని నియోగించెను. పరమానందమున వల్లె యని మహారాజుయొక్కయు, మహారాజ్ఞులయొక్కయు నాశీర్వాదంబులం బొంది రామలక్ష్మణులు శస్త్రాస్త్రపాణులై విశ్వామిత్రుని వెనువెంటం జనిరి.

ఇట్లు వీరు మువ్వురుం బ్రయాణమైపోవుచుండ, విశ్వామిత్రుండు రామునితో నిట్లనెను. “వత్సా! రామా! ఈ పవిత్రమయిన గంగోదకమునందు స్నానముచేసి నా కడకు రమ్ము. నీకు మంత్రోపదేశము చేసెదను. ఆ మంత్రంబును బఠించితి వేని నిన్నెవ్వరు నోడింపంజాలరు.” అని ఋషి పలికిన చొప్పున రాముండు స్నాతుండై మంత్రశిక్షితుం డయ్యెను. మంత్రోపదేశముం గాంచినతోడనే యొక యద్భుత మైన తేజస్సు రామునియం దుత్పన్న మయ్యెను.

సంధ్యాకాలమై రజని యతి సమీపమునకు వచ్చుట వలన వా రా రాత్రి యచ్చటనే గడపుటకుఁ గృతసంకల్పులై నిలిచిరి. రాత్రియంతయు సుఖంబుగ నిద్రించి ప్రభాతమున మరల ప్రయాణము సాగించిరి. ఆ దినమంతయు నడిచి నడిచి యా రాత్రి యంగదేశపు ఋష్యాశ్రమమునఁ గాలము గడపిరి. అది సరయూగంగానదుల సంగమస్థానము. ఋషులు వారిం దెప్పలవలన గంగా ప్రవాహమును దాఁటించి యవ్వలి యొడ్డునకుం జేర్చిరి.

అచ్చట భయంకర మయిన రాక్షసులతో నిండిన యొక ఘోరారణ్య ముండెను. అందుఁ దాటక యను నొక నిశాటి వాసముం జేయుచుండెను. అదియే మారీచ సుబాహుల మాత. దానికి సహస్రగజ సమానబలంబు గలదు. ఆ వన మంతయుఁ బూర్వము జనసంకులమై యుండెనఁట. రాక్షసుల దౌష్ట్యమువలననే సర్వ జనంబును సమసిపోయెనఁట.

రాముఁ డబల యని దానిం జంపఁబూనుటకు సందియం బందుచుండఁగ, కౌశికుండు "లేశమయిన దయ చూపక దీనిని జంపుము. అబలను జంపుట పౌరుషహీనంబని తలంపకుము. ఈ రాక్షస స్త్రీ మహా పాపాత్మురాలు. మునులు మొదలగు వారిఁ బెక్కురం జంపి భక్షించినది. దీనిం జంపినఁ బాపంబు లేదు" అనెను. అప్పుడు రాముఁడు తాటకతో యుద్ధ మొనర్చుటకుఁ బూని ధనుష్టంకారముఁ జేసి పురికొల్ప నది భీషణాకారముతో నొడలు తెలియక పరుగిడి వచ్చి రాముని

నెదిరించెను. శ్రీరాముఁ డతి దయాశీలుఁడు గానఁ దాటకఁ జంప నుంకింపక బెదరించి విడువవలయు నని యూహించెను. కాని తాటక దాని కవకాశ మిచ్చినదికాదు. క్షణక్షణము భీకరములగు రూపములను ధరించి పెద్ద పెద్ద ఱాళ్ళను వర్షింప మొదలు పెట్టెను. "అహా! ఘోర పాపాత్మురాలగు దీని నిం కేల చంపవు? పొద్దు గుంకిన కొలంది దానికి బలము వృద్ధి యగుచుండును. శీఘ్రముగ సంహరింపు" మని విశ్వామిత్రుఁడు రాముని త్వరపెట్టెను. గురువాక్యము లాలించినతోడనే యతఁడా రక్కసి యక్కు ముక్కలగు చక్కనొక్క బాణము సూడిగ విడిచెను. వెంటనే యది యమపురంబున కరిగెను.

దిననాథ కులోద్భవుల నా బాలుర దీవించి గాధేయుఁడు వారికి ఘనతరాస్త్రంబులఁ గానుకగా నొసంగె. అమోఘంబులును, నానావిధములు నగు నా యస్త్రంబులుండిన నెవ్వరు గెలువనేరరు జాల రని కౌశికుండు తెలంచెను. రామలక్ష్మణులు తాటకను సంహరించిన పిమ్మట నమ్మౌని తన యాశ్రమమునకు వారిం దోడ్కొని పోయెను. ఆ యాశ్రమ మతి రమ్యముగ నుండుట వలన, "మునీంద్రా! ఈ వనంబున నెవ్వరు వసింతురు? ఇది మిక్కిలి యందముగ నున్న" దని శ్రీరాముఁడు వినయంబున నడిగెను. విశ్వామిత్రుఁ డంతట నతనికిఁ బ్రత్యుత్తర మీయ నెంచి, "ఈ యాశ్రమంబు సిద్ధయోగ్యంబు. పూర్వ మిది కశ్యపుఁ డను మహా

మునికి వాసస్థలంబు. అతండు పత్నీసమేతుండై వర్షసహ
స్రంబు తపము చేయుటవలన నేకేశ్వరుం డగు విష్ణుప్ర
సంప్రాప్తిం జెంది వారి గర్భమున నుద్భవిల్లెను. అతని పేరు
వామనుఁడు. అతడు మిగుల నాశ్చర్యకరము లగు కార్యం
బులఁ జేసెను. ఇప్పుడు నేనిక్కడ నివసించుచున్నాఁడను.
ఇక్కడ రాక్షసులు మదీయ యజ్ఞంబుల ధ్వంసంబొనరించు
చున్నారు. ఆ క్రూరాత్ముల నీవ వధింపవలయు" నని పలి
కెను. మఱునాఁటి యుదయమే కౌశికుఁడు యజ్ఞముఁ జేయఁ
గడంగెను. ఆఱుదినంబు లీ జన్నంబు మౌనంబునఁ జేయ
వలయు. అట్టులను రాత్రులుం బగళ్ళును గడచెను. ఆఱవ
నాఁడు రామలక్ష్మణు లతిజాగరూకులై దైత్యసంహారం బొన
రింపఁ జూచుచుండిరి. అప్పు డాకస్మికముగ వేది యగ్ని
జ్వాలామయ మయ్యెను. రక్తవర్షము కురియ నారంభించెను.
ఆకాశమునుండి భయంకర నినాదములు కర్ణకఠోరంబుగా
వీతెంచెను. అంత రాముఁడు వ్యోమమార్గముం జూడ,
మారీచుఁడు, సుబాహుఁడు మొదలగు ఘోరరాక్షసులు
వచ్చుచుండుట గానిపించెను. వారిం జంపుట కిష్టము లేక
పోయినను వా రొనరించు దుష్కార్యములకు సహింపఁజాలక
రాముఁడు మారీచుని వక్షస్స్థలము భేదించునట్లొక బాణము
విడిచెను. ఆ బాణఘాతమువలన శతయోజనంబుల దూర
ముననున్న యొక జలధిలో నతండు పడెను. మఱియొక
తీవ్రాస్త్రమును సుబాహునిపయిం బ్రయోగింప నతం డచ్చ
టనే పడి చచ్చెను. ఆ దుష్టుల మరణంబునకు ఋషులెంతయు

సంతసించి రామలక్ష్మణుల నాశీర్వదించిరి. స్వర్గమునుండి దేవ
తలు పుష్పవర్షము గురిసిరి; మఱియు జయ జయ నాదములు
దివినుండి వినన య్యెను.

ఆ రాత్రియంతయు సుఖనిద్రం గడపిన తరువాతఁ
గౌశికుఁడు రామలక్ష్మణులం దోడ్కొని మిథిలకుం బోవఁ
బయన మయ్యెను. అట్లు పోవుచుండ వారికిఁ బథమధ్యమున
ఫలవంతమైన పచ్చని వరిపైరులు గానఁబడెను. రామలక్ష్మణుల
కా దారిని బోవుట చాల సంతోషముగ నుండెను. శోణనది,
గంగానది మున్నగు పావన నదులం దాఁటి నాలుగు దినంబు
లకు వారు మిథిలానగరంబు సమీపించిరి. నగర నికటమున
నొక చక్కని పురాతనాశ్రమ ముండెను. అయ్యది మనుష్య
సంచారము లేక నిశ్శబ్దముగ నుండెను. అది గౌతమ మహా
ముని తపోవనంబు. తన భార్యయైన యహల్య యతి ఘోర
కార్య మొనరించుటవలన, అతఁడామెం బాషాణమవై పడి
యుండు మని శపించి తాను దపస్సు సేయఁ గైలాస పర్వత
మునకుం బయనమయ్యె.

శాపవిముక్తికై యహల్య బహువిధంబులఁ బ్రార్థింపఁ
దుదకు "దశరథ తనయుండు కౌశికమఖ రక్షణం బొనరించి
తన తమ్మునితోఁ గూడివచ్చునపు డాతని పాదములు సోఁకుట
వలనం దిరుగఁ బడఁతి వయ్యెద" వని యతఁ డభయ మిచ్చి
యామె నోదార్చెను. ఈ సమాచార మంతయుఁ గౌశికుని
వలన నెఱింగి రాముఁ డా యాశ్రమమునకుఁ బోయినతోడనే

యహల్యాదేవి శాపవిముక్త యయ్యెను. అంతకాల మామె శిలయై పడియుండెను. శ్రీరామచంద్ర పాదస్పర్శనంబు వలన నామె దివ్యసుందరాకారము ధరించెను. రామలక్ష్మణులు మునిపత్ని యని యామెకు ముదముతో మ్రొక్కిరి. అంత "వారిదశ్యామా! నా ప్రణామముఁ గైకొనుము. భవత్పాద స్పర్శన లాభంబున నేను బవిత్రురాల నగుట యొక వింత కాదు. నీ నామాక్షరంబు లెవ్వరి హృదయంబున మననంబు సేయఁబడు నట్టివారి సర్వ పాపంబులు నిర్మూలంబు లగును. మహామును లాదట నిన్ను భావమునం దుంచుకొని సర్వదా పూజించెదరు. ఓ వనజాతాక్షా! రాఘవ రామా! స్వప్రకాశా! జగత్సృష్టిస్థితిలయకారణా! నిన్నుం బొగడుటకు నే నెంతదాన? నిన్నే యనవరతంబుం గొల్చుచుండెద" నని యహల్యాదేవి రాముని స్తుతించె. గౌతమ మహాముని దివ్యదృష్టిచే నది యంతయుఁ దెలిసికొని యచ్చట కేతెంచెను. అహల్య కష్టము గట్టెక్కెను. అప్పటి నుండియు భార్యాభర్తలు సుఖముగాఁ గాలక్షేపము సేయఁదొడంగిరి.

గౌతముని యాశ్రమమునకు సమీపముననే మిథిలానగర ముండుటవలన వారు శీఘ్రముగ నా పురముఁ బ్రవేశించిరి. విశ్వామిత్రుఁ డేతెంచినాఁ డనిన వార్త తెలిసిన వాఁడనే మిథిలేశుఁ డగు జనకమహారాజమ్మని నెదుర్కొని యత్యంత భక్తితో నర్ఘ్యపాద్యాదు లిచ్చి తుష్టిపఱచి "ఓ మునీంద్రా! మీతో నేతెంచిన యీ దివ్యసుందరమూర్తు

లెవ్వరు? వీరు దేవతలం బోలెఁ గాన్పించుచున్నారు. ఏరాజు గర్భమున నుదయించి గృహంబు పావనం బొనరించిరి? దయ చేసి చెప్పుఁ"డని కోరెను. ఆమాట విని కౌశికుండు "వీ రయోధ్యాధిపతి యగు దశరథుని వీరకుమారులు. వీరు సిద్ధాశ్రమమున నున్న రక్కసులం జంపి యహల్యాశాపముం బాపి శివధనుర్దర్శనంబున కిట కేతెంచి"రనెను. శతానందుఁడు మిథిలేశ్వరుని పురోహితుఁడు. అతం డహల్యాపుత్త్రుండగుట వలన జననిశాపవిముక్తికి మితిమీఱిన యానందము నొంది గాధేయునకును, శ్రీరామునకు దన సంతోషమును వెలి పుచ్చి వారిం బొగడెను.

మఱునాఁటి యుదయము కౌశికముని యాజ్ఞప్రకారము విల్లు సభకుఁ దెప్పింపబడెను. జనకమహారాజు "ఇది పూర్వము శివుని ధనుస్సు. ఒకానొకప్పుడు దేవతలపై నాగ్రహము చెంది శివుఁడీకార్ముకముతో వారిని వెంబడించెను. కాని, దేవత లతని నెక్కుడుగఁ బూజించి ప్రతిమాలుకొన నతండు సంతుష్టాంతరంగుండై యీ ధనుస్సును వారి కొసం గెను; దేవతలు దేవరాతుని కిచ్చిరి; అతండు మాపూర్వపురుషుండు." అని చెప్పి సీతావృత్తాంతం బిట్లు నుడువందొడంగె;

"ఒక దినంబు నేను యజ్ఞస్థలము దున్నుచుండఁ గఱ్ఱు తగిలి నాగటిచాలు ముఖంబున పృథ్వీగర్భమునుండి యొక సౌందర్యవతి యగు శిశువు గల మందసం బొంతు లభించెను. అందలి బాలిక ననురాగంబున నెత్తి పెనిచి యామెకు సీత

యని నామకరణం బొనర్చితిమి. "సిత" యను పదంబునకు నాఁగటివలనఁ గలిగిన "చాలు" అని యర్థము. ఆమె నాకుం బ్రియపుత్రికయై నా యింటం బెరుఁగుచున్నయది. ఈ శివ కార్ముకంబు నెవ్వం డెక్కు-పెట్టనోపునో వానికి నాకొమార్తె నొసంగం దలంచి యది యొక ప్రతిజ్ఞగాఁ గైకొన్నవాఁడ. నానాదేశ రాజన్యులుం దీనిని గదల్పఁజాలక నిరాశ చెందిరి. వారు సీత లభింపమికిఁ గినిసి నాతో యుద్ధంబు సేసిరి. నేను దైవసహాయంబున వారి నందఱిని నోడింపఁగలిగితిని. శ్రీరామ చంద్రా! నీవా విల్లు జవ్వాన వంచి సీతం బెండ్లియాడు" మని జనకచక్రవర్తి పలుకుచున్నంతఁ, బలువురు సేవకు లా ముక్కంటి వింటిని అష్టచక్ర శకటంబున నిడి తెచ్చి శ్రీరాముని చెంగటం బెట్టిరి. ఆ ధనువుం జూడఁగనే శ్రీరాముఁ డవలీల బెండుంబోలె మీఁది కెత్తి వంప నుంకింప నది రెండు తుండెంబులుగ ఖండితంబయ్యె. ఆ వీరున కించుకయుఁ గష్టము లేకపోయెను. శ్రీరాముఁ డింత యశ్రమంబుగ విల్లు విఱుచుటవలన "అది తేలికయా? ఆ కార్య మొనరించుటయే తేలికయా?" యని సందేహింపవచ్చును. కాని, యటు తలంపకుఁడు. మహావీరులగు రాజన్యకుమారులకు వశంబు గాని పనిని శ్రీరాముఁ డొనరించుట యతని బలాధిక్యతనే వెల్లడించును.

విశ్వామిత్రుఁడు, జనకుఁడు, రామలక్ష్మణులు దక్కఁ దక్కిన వా రందఱు విస్మయానందభరితులై నివ్వెఱపడిరి.

"శ్రీరాముని బలపరాక్రమములను గుఱించి వింటిని గాని యతఁ డైనను దీనిని వంపఁగలఁడని తలంపకుంటిని. పరమ సౌందర్యవతి నా ముద్దులకూఁతురు జానకియే శ్రీరాముని భార్య" యని జనకుండు పలికె.

దశరథమహారాజున కీ శుభవార్తం దెలిపి లగ్న నిశ్చయమునకు సేవకులం బంపిరి. ఈ యానందవార్త దశరథుండు వినినతోడనే సంతోషపరవశుండై వశిష్ఠాది పురోహితులతోడను బంధుజాలంబులతోడను మిథిలకుఁ బ్రయాణ మయ్యెను. అతండు తీసుకొని వచ్చిన ధనమునకును, రత్నములకును, సామంత రాజు లొసంగిన కానుకలకును మితియే లేదు. అతఁడటు బయలుదేఱి పత్నీ సమేతుండై నాలుగు దినంబులకు మిథిలానగరంబుఁ జేరె. అంతటఁ గౌశికుండు కుమారులం దోడ్కొనిపోయి మనుజేశ్వరుండయిన దశరథునకుఁ బ్రేమతోఁ జూపెను. తన ప్రాణప్రియులగు సుతులం జూచి "గాధినందనుని కృపవలన ఘనమగు శుభంబు నాకుఁ గలిగినది. మఱియు, నాకు జనక మహారాజు వియ్యంబు గలుగు భాగ్యము లభించినది" యని గురుబుధసచివాప్తులతోఁ గూర్చుని యనకులేశ్వరుండింపుగ సంభాషింపఁ జొచ్చె. మిథిలాధినాథుండు మంగళధ్వానంబులు సేయ నియోగించి దశరథరాజేంద్రు నెదుర్కొన నేతెంచెను. ఆ సమయంబున రత్నాభరణ వస్త్ర వాహనాది భాగ్యంబులు గానుకగా నొసంగి

వారిని బహూకరించెను. మంగళవాద్యంబులు మిన్నుముట్టె. వేశ్యానాట్యంబులు విరాజిల్లె. పట్టుపుటెనుంగుపైఁ బైడి యంబారిఁ గట్టించి యందు గందర్పసదృశుండైన శ్రీరాముఁ గూర్చుండఁబెట్టి లక్ష్మణ భరత శత్రుఘ్నులను రథములపై నెక్కించి బుధవర్గంబుతోఁ బురప్రవేశ మొనరించిరి.

అచట భూసురాంగనలు సీతాదేవి మొదలగువారికి మంగళస్నానములు చేయించిరి. కనక సౌధంబునఁ గనక పీఠమున దశరథతనయు నాసీనుం జేసిరి. పట్టుదువ్వటి నొకదానిం దెచ్చి రామభద్రున కడ్డంబు కట్టిరి. అంతట సర్వాభరణ భూషిత యగు సీతాదేవిని గల్యాణ మంటపమునకుఁ దీసికొని వచ్చి వివాహ వేదికం గూర్చుండఁబెట్టిరి. సాలంకృతముగను సాక్షతోదకముగను ఆ క్షణంబుననే జనకుండగు జనకుండు కన్యాదానంబు గావించె.

"శ్రీరామచంద్రా! ఇదిగో సీత. ఈమె నిన్ను విడువక నీ సుఖదుఃఖంబులందు సహభాగినియై నీ ప్రక్కనే యుండు" నని శ్రీరామునితోఁ జెప్పి జనకుండా వధూవరులపైఁ బూతోదకముం జిలికి వారి నాశీర్వదించెను.

ఈ శుభవివాహసమయమందే జనకుండు తనకొమార్తె యగు నూర్మిళాకన్యామణిని లక్ష్మణునకును, తన సోదర పుత్రికలగు మాండవీ శ్రుతకీర్తులను జతురులైన భరత శత్రుఘ్నులకును ఇచ్చి వివాహము గావించెను. నభంబునుండి దేవతలు దుందుభులు మొరసిరి; పూలవాన కురిసిరి. విధ్యుక్తముగ

జయప్రదముగ వివాహకార్యంబులు నెఱవేఱెడి దినములలో మిథిలాపురంబు తేజోమయం బగు మణి దీపంబులతోడను, మంగళతూర్య నినదంబులతోడను, మంత్రతంత్ర విధానంబుల తోడను, ఋషిగణ కలకలంబులతోడను, మహావైభవంబునఁ బ్రకాశించుచుండె. నానావిధేష్ట భోజనములతో సర్వజనులు సంతృప్తింజెందె కోలాహలంబు సేయుచుండిరి. ఇవ్విధంబున వివాహోత్సవంబు పరిసమాప్తి నందిన పిమ్మట గాధేయుండు హిమాచలంబున కరుగఁ బయనమయ్యె. దశరథుండును అయోధ్యకుం జనఁ బ్రయాణం బయ్యె. అంత మహాజ్ఞాన సంపన్నుఁడగు జనకుండు గోహిరణ్యాదుల ఘోటకంబుల ద్విరదంబుల వరదంబుల బహు రత్నరాసుల సాహసవంతు లగు సద్భటులఁ దన దుహితుల కరణంబుగ నొసంగె. బిడ్డల నత్తవారింటికిఁ బంపువేళ, నెంతటి జ్ఞానవంతులుఁ గవిన హృదయులు నైనను, జననిజనకులు కనుల నీరు నింపకుండఁజాలరు. "అమ్మా! తల్లీ! సీతమ్మా! నీవు శ్రీరాముఁడే దైవంబుగ భావించుకొని మచ్చికతోఁ బ్రవర్తింపుము. అత్తమామల సేవ లతిభక్తితోఁ జేసి మన వంశమునకుఁ గీర్తిఁదెమ్ము. బంధు జాలంబు ననురక్తిం జూడుము. మఱందుల యెడ భక్తియు, సేవకజనంబులయెడఁ బ్రేమయు వినువకుము" అని యీ విధం బుగ జనకుండు తనకొమార్తెల కొక్కొకరికిని బుద్ధులు గఱపి వారి నత్తవారింటి కనిపె. దశరథ మహారాజు నలుగురు పుత్త్రులు, నలుగురు కోడండ్ర బృందంబున వెంట రా నయో ధ్యకుం బోవుచుండె.

ఆకస్మికముగ నాకస మంతయు మబ్బు గ్రమ్మి నల్లగఁ బొగ యల్లుకొనిన ట్లుండెను. భూమి కంపింపసాగెను. వర్షము లతితీవ్రంబుగఁ గురియఁజొచ్చెను. వడివడిగ ఝంఝూమారుతంబులు వీవందొడంగెను. సూర్యుం డదృశ్యుం డయ్యెను. ప్రపంచం బంతయు నంధకార బంధురంబయ్యె. ఏమి ఘటిల్లనున్నదో యని యెల్లరు నాశ్చర్యపడసాగిరి. సంక్షోభ కారణముఁ దెలిసికొనుట కెక్కువ వ్యవధి యవశ్యము కాకపోయెను. యమునివలె భయంకరాకారుండును, ఇంద్రుని వలెఁ బరాక్రమ సంపన్నుండును సూర్యునివలెఁ దీక్ష్ణ తేజుండును నైన పరశురాముఁడు వాయుమార్గమున వచ్చుచున్నట్లు కాన్పించెను. అతని దేహము పర్వతమువలె నుండెను. దృష్టు లగ్నిజ్వాలలవలెఁ బ్రజ్వలించు చుండెను. హస్తమున నొక ప్రశస్తమయిన ధను స్సుండెను. అతఁడు దీప్తివంత మగు నొక కవచముం దాల్చి భుజంబున నొక పెద్ద కుఠారముం బెట్టుకొని మహావేగమున వచ్చుచుండెను. అతండు జమదగ్ని మహాముని పుత్త్రుండు. పరమభక్తుండును, ఋషీశ్వరుండును నైన తన తండ్రిని అవినీతుండగు నొక రాజు చంపినందు వలన, అతండు తనకుం గాన్పించిన క్షత్రియుల నెల్లరఁ బలి మార్ప నిశ్చయించుకొని పెక్క క్షత్రియవంశముల నిర్మూల మొనరించెను. ఇప్పుడు శ్రీరామునిం గూడఁ జంప నిశ్చయించుకొనెను. పరశురాముఁ డేతెంచుటం జూచి వసిష్ఠాది ఋషి[illegible]లును, దశరథుండును భయంపడి యతని మనగ కో[illegible]పశమింపఁ జేయుటకై మంచిమాటలాడ నారం

భించిరి. ఎవ్వరెంత ముఖస్తుతి చేసినను అతండు వినువాఁడా! పరశురాముఁడు శ్రీరాముని వంకకుఁ దిరిగి "ఓ శ్రీరామా! నీ ప్రఖ్యాతి చాల వినియుంటిని. జనకుని యింటనున్న పురాణకార్ముకంబును విఱిచి సీతను బాణిగ్రహణముఁ జేసి కొని వచ్చుచుంటివని కూడఁ దెలిసిన కతంబున నిన్నుఁ జూడ నేతెంచితి" నని పలికెను.

దశరథుఁ డా మాటలు విని తన సుతున కేమి యాపద ఘటిల్లునో యని భయపడుచు "మహానుభావా! ఋషిపుంగవా! నీవు విరాగివై యాయుధంబుల విడిచియుంటివి. మరల క్షత్రియులతో యుద్ధము సేయ సమకట్టితివా! మమ్ముఁ గరుణింపుము. మత్ప్రియ పుత్రుండగు రాముని గావుము. నీశరణుఁ జొచ్చితిమి" యని పరిపరి విధంబుల వేడుకొనెను.

దశరథుని మాటలను లక్ష్యము సేయక శ్రీరామునితో మరల పరశురాముఁడు "శ్రీరామా! ఆ ధనుస్సుతో సమాన మయిన యీ కార్ముకంబును గూడ భగ్నంబు సేసి నీ పరాక్రమముఁ జూపు" మనెను. అంతట శ్రీరాముఁడు పరశురాముని తామసవాక్యములు విని యతని కార్ముకముం గొని "ఋషీశ్వరా! పరశురామా! నీ వొనరించిన ఘన కార్యములను నేనును వింటిని. నీవు క్షత్రియకులంబును జాల వఱకు నశింపఁజేసిన వాసి కూడ విశదమే. అంత మాత్ర మున గర్వింపకుము. వారు బలహీనులై నీ మూలమున మృత్యువు వాతం బడిరని వింటి"నని బాణము వదలుటకు

సన్నద్ధుఁడై "ఓ బ్రాహ్మణకులోత్తమా! నిన్ను వధింప నామనం బిష్టపడకున్నది. నిన్నుఁ జంపిన ఘోరపాతకంబు చుట్టుకొనుం గావున, నీయొద్దనున్న శక్తులం గైకొందునా! లేక నీవాకాశంబునకుం బోవు మార్గంబు నరికట్టుదునా?" యని యడిగెను.

అంతఁ బరశురాముని కోప మెచ్చటికిఁ బోయెనో, అతఁడు తన దగ్గఱనున్న శక్తులనే తీసికొమ్మనెను. "నీకు మంగళ మగుంగాక! నీవు సామాన్యమానవుండవు గా" వని పల్కి పరశురాముఁ డతనికిఁ బ్రదక్షిణం బొనరించి మ్రొక్కి తన దారి వెడలిపోయెను. తత్క్షణంబ యాకసంబు నిర్మలమై ప్రకాశింప దొడంగెను. దశరథాదులు సుఖంబుగ నయోధ్యం జేరిరి.

అంతట రాజు లందఱుఁ దమ కోడండ్రకు స్వాగతంబు నొసంగి సంతోష సాగరంబున నోలలాడఁ జొచ్చిరి. ఇట్లు వారముదినంబును పూజలతోడను, గానాది వినోదముల తోడను సంతోషముగఁ గడపుచుండిరి. అంతఁ గొన్నాళ్ళకు భరతశత్రుఘ్నులు మేనమామ యింటికి వెళ్ళిరి.



శ్రీరస్తు.

# సీతారామము

## రెండవ ప్రకరణము.

దశరథుండప్పటి కించుమించు షష్టిసహస్రవర్షముల ప్రాయము వాఁడు. ఇన్ని సంవత్సరంబుల వయస్సు గలవా రెంత వృద్ధులై తేజోహీనులై యుందురో మీరే యూహించుకొనుఁడు. ఆ రాజన్యుని కింక రాజ్య పాలనంబు సేయుట యతి దుష్కరముగ నుండెను. అంత, దశరథుండు విద్యావంతుఁడును, బలపరాక్రమశాలియు, గుణాఢ్యుఁడును నగు శ్రీరామునిఁ బట్టాభిషిక్తునిఁ జేయ నుద్యమించి, వసిష్ఠుం గాంచి "నేను వృద్ధుండ నైతిని. సమర్థులగు కుమారు లున్నప్పుడు రాజ్యభారంబు వహించి నాబోంట్లు కష్టించుట తగదు. నా కుమారుండు రాజ్యంబు పాలించుచుండఁ జూచు భాగ్యంబు నాకు రాజత్వంబుకన్న గౌరవార్హంబుగదా! శ్రీరామమూర్తిని పట్టాభిషిక్తుం గావించి సంతోషమునఁ గాలంబు గడపు తలంపు నాకుఁ గలదు. కావున, నొక శుభముహూర్తంబు నిశ్చయింపుఁ"డని కోరెను. వసిష్ఠుండు మంత్రుల రావించి దశరథుం డానందించునట్లు "ఓ సచివశిఖామణులారా! అంబుధరశ్యాముఁ డగు రాముని పట్టాభిషేకోత్సవమునకుఁ
సిన సంభారములనెల్ల సమకూర్పుఁడు. మంచి దినంబుం జూచి పురంబెల్ల శృంగారించునట్లు నియమింపుఁ" డని

హెచ్చరించెను. మంత్రులు భూసురశ్రేష్ఠులం బంపి గంగోద కంబులం దెప్పించి రాజమార్గంబు లన్నియు శుభ్రపఱుపించిరి. ఈ వార్త కర్ణాకర్ణికగఁ బురజనంబుల చెవులఁ బడ, వారెల్లరు మహానందసాగరమున నోలలాడఁ జొచ్చిరి. ఎల్లెడల మంగళధ్వానంబులు పెల్లుగ విలసిల్లె.

ఈ శుభవార్త తన కెఱిగించుటకు వసిష్ఠుండు రాఁగ, శ్రీరామచంద్రుండు తాను లేఁగి గురువర్యునకు భక్తివినయ పురస్సరంబుగ వందన శతంబు లర్పించి, భాసుర గురుపాద పంకజ యుగంబుఁ బ్రక్షాళన మొనరించి యర్చించెను. ఇయ్యది కౌసల్యకుం దెలియఁగనే యామె నానావిధ రత్నంబులు, ధనంబులు, ధాన్యంబులుఁ మాన్యులగు ద్విజపుంగవులకు దానంబు సేయందొడంగె.

మఱునాఁడు రామునకుఁ బట్టాభిషేకం బొనరింతురను శుభవార్త పురంబున నెల్లెడల విస్తరిల్లె. అయోధ్యాపురం బంతయు నానంద కోలాహలంబుల నిండియుండె. పౌరులందఱు శ్రీరాముఁడు తమకు రాజగు నని యత్యంత హార్ద పరిపూర్తులై యుండిరి. ఈ శుభంబును గాంచి సహింపజాలక యొక దాసి యందఱ సంతోషము నశింపఁజేయ సమకట్టెను. మంధర యనునది కైకకు బంధుదాసియు, గాలసర్పమువంటి దుష్టాత్మురాలును. అది గూను గలిగి యుండుటచే సాధారణముగా గూనిది యను పేరం బిలువంబడుచుండెను. అది యెంత వికృత స్వరూపిణియో దాని మనో భావంబు గూడ

సంత కౌటిల్యంబు చెందియుండెను. ఈ దాసి తనకుఁ దలిదండ్రులచే నరణంబుగ నీయఁబడిన దగుటం గైకకు దీని యందుఁ బ్రేమము మిక్కుటంబు. మంధర సౌధాగ్రంబునుండి పురశృంగారంబంతయుఁ దిలకించి రామునకుం బట్టంబు గట్ట సమకట్టుట నెఱింగి కోపంబునఁ గన్నుఁ గెంపుపడఁ గైక యొద్దకుం బరుగునఁ బోయి "అమ్మా! యాలకింపుము. నీ సర్వంబును నాశనంబయ్యె. వేసవి కాలపు నదీ ప్రవాహము వలెనే నీ భాగ్యంబు నడుగంటిపోవుచున్నది. నీకు భయం బించుకేనియు లేదా? నీ రాజు శ్రీరామచంద్రుని రాజుగాఁ జేయఁబోవుచున్నాఁ"డని తత్తరించుచు వక్కాణించెను.

ఆ మాటలు విని కైక "ఓ మంథరా! రాముఁడు రాజయిన నాకుం బరమానందము. నాకు భయం బేటికి? చిరంజీవి నా భర్తుండు; నన్ను గన్నతల్లి కౌసల్యంబోలెఁ బ్రేమించు; నీవు తప్పుదారిం బడితివి; ఎన్నండు నట్లు భావింపకుము. నాకు శ్రీరామచంద్రుండు పెద్దకుమారుండు. అతండు రాజ్య మేలుచుండుట జూచు భాగ్యం బెంతటివారికి లభించును? నీ వీ శుభవార్తం దెలియఁబఱచి నందులకు సంతోషంబు మితిమీఱుచున్నది; ఇదిగో, నీకీ రత్నహారమ్ము నొసంగెద, గైకొమ్ము" అనెను. అది విని వక్రాంగియైన యాదుష్టమంథర మిగులఁ గోపపరవశయై యామె యొసంగు రత్నహారముం గైకొనక పెడ మొగంబు పెట్టి "నీ యవివేకంబునకు నే నచ్చెరు వొందుచున్నదాన. నీ సవతి

నీకంటెఁ దన కొడుకు భాగ్యము కలిగినందులకు సంతో షించుచున్నది. కౌసల్య రాజమాత కాఁబోవుచున్నది. నీవు కౌసల్యకు దాసీత్వంబు నెఱపుచు రాముసకు బానిసవై యుండుట నాఁబోటిది చూడఁజాలదు. నీకేల యిట్టి పాడు కోరిక పుట్టినది?" యని దుర్బోధనముఁ జేసెను. కైకేయి యప్పటికిని శ్రీరాముని యెడ మంచి భావమే కలిగియుండెను. "జ్యేష్ఠ పుత్రుఁడు నత్యంత ధార్మికుఁడును, బుద్ధిమంతుఁడునై జగంబునఁ గీర్తింపఁబడుచున్న శ్రీరాముఁడే రాజ్యమున కర్హుండు. నాకు భరతుం డెట్టివాఁడో శ్రీరాముఁడు నట్టివాఁడే. వ టి యంతకన్న నధికుఁ డనియుఁ జెప్పనొప్పు. అతఁడు రా జ్యాభిషిక్తుండై సోదరుల సుఖపెట్టు" నని కైకేయి పలికెను. ఆ పలుకులు విని మంథర దీర్ఘనిశ్వాసము విడుచుచు, "అయ్యో! కైకేయి! నీ వెంతటి యజ్ఞానురాలవు. నేను నీమంచి కొఱకె కొన్ని విధములఁ జెప్పినను నా మాటలు నీవు చెవిం బెట్టుచున్నదానవు. శ్రీరాముఁడు రా జయిన మొదల భరతునిఁ దన రాజ్యమునుండి వెడలనడఁచునో, లేక మృత్యు ముఖంబునఁ బెట్టునో! నీవు మహారాజునకుం బ్రియభార్యవై కౌసల్యయెడ నిర్లక్ష్యముగా నుంటివి. ఇప్పు డామె రాజమా తయై తన కసి తప్పక తీర్చుకొనును. ఈ సమయమందే భరతుండు రాజగునట్లును, శ్రీరాముఁ డడవికిఁ జనునట్లును జేయుట కుపాయంబు నాలోచింపు" మనెను. అహా! ఈ మంథర యిందునకే జన్మించినదా యేమి? అది కైకేయి మన స్సునం దోర్వలేమి నావేశింపఁ జేసినది. భరతుని శ్రీరాముఁడు

చంపివేయు నని భయకంపితురాలై శ్రీరాము నడవికిం బంపు టకును, భరతుని రాజుం జేయుటకును నుపాయముం దెలుపు మని కైక మంథరం గోరెను. అప్పుడు మంథర తన ముఖము వికసింప, "ఏమీ! నీవన్నియు మఱచిపోయితివా? దండక వనమ్మునందలి వైజయంతీనగరమున శంబరుం డను దైత్యుండు దేవతలతో యుద్ధము చేసినప్పుడు మహారాజు దేవతల పక్షమున నున్న పోరాడలేదా? అయోధ్యాపురాధీశ్వరుండు నిన్నును దనతోం దోడ్కొని పోలేదా! ఆ సమయమున మహారాజు తీవ్రముగ గాయపడి నిశ్చేష్టితుండై యుండ నీవతనిం దోడ్కొనిపోయి రక్షింపలేవా! అప్పు డతండు నిన్ను రెండు వరంబులు గోరుకొ మ్మనలేవా? అంత నీవు సమయము వచ్చినప్పుడు వేడుకొందు ననలేదా? ఈ సమాచారము లన్నియు నీముఖమ్మున నే వింటిని. ఇప్పుడు నీ వెందుల కా వరంబులు వేడుకొనరాదు? ఒక వరము శ్రీరాముం డడవికిం బోవునట్లు చేయుటయు, రెండవ వరంబు భరతునకుం బట్టాభిషేకంబు సేయుటయు నని కోరుకొనుము. నీవా వరములను కోరుటకు ముందొక కార్యంబు గావింప వలయును. మలిన వస్త్రములు ధరించి క్రోధంబునం గోపాగారంబునకుం బొమ్ము. రాజు నిన్నుం జూడ నేతెంచునప్పుడు పలుకక యాక్రందనంబు సేయుచుండుము. రాజు నీ యందలి ప్రేమచే నీజాడం జూడంగనే భయకంపితుం డగును; నిన్ను సంతోషపెట్టుటకై నీ వేమి కోరిన నిచ్చును. "నీ వేమి కోరిన నది నీకిచ్చెద" నను మాట మహారాజు నోట వెలు

వడిన తరువాత నీ వీ వరములను గోరుము. అప్పుడు రాజు
అన్యథాకరించుటకు వీ లుండదు.” అని కైక కుపదేశంబు
చేసెను.

ఇట్లు మంథరోపదేశముం గాంచి క్రోధగృహంబునకుం
జని కైక మలిన వస్త్రధారిణియై నేలం బవళించియుండె
అంతలో, దశరథుండు సకల సంభారముల సమకూర్చ సము
చితోద్యోగుల నియమించి తన ముద్దుసతి యంతఃపుర
మున కేగెను. అచ్చటం దన సతి గానరాదయ్యె. పరిచారి
కల నడుగ, వా “రా యిందువదన కోపగృహంబునకుం జని
నది; కారణ మెఱుంగజాల”మనిరి. అంతట నా జననాథుం
డా నళినాయతాక్షి సమక్షంబునకుం జని “ఇంతీ! నీ కింత
వంత యొదవుటకు? నిను యెడ నేరముం జేసిన నిర్భాగ్యుడెవరు?
చెప్పుము. శ్రీరాముడైన నే శిక్షింతును. ప్రాణేశ్వరీ! అది
కారణంబు కాదేని, నీ కేమి కావలయునో తెల్పుము. నీ
కోర్కె తప్పక నెరవేర్చెద. దుఃఖంబు బుడుగు”మని యను
నయించెను. తాను ప్రతిజ్ఞ చేసినం గాని కైక యేమియుం
గోర దని దశరథుం డెంచి “నే నీ పుడమియందు రాముని
వలె నెవ్వరిం బ్రేమింపను. ఆ రాముని యాన, నీ కోరిక
యెద్దియో విశదపఱుపుము; దానిని దప్పక తీర్చెద” నని
పలికెను. అంతటం గైక మహారాజా! దేవాసుర యుద్ధ
మందుం దొల్లి నీ విచ్చిన తోరంపు వరము లిప్పుడు ప్రసాదిం
పుము. భరతుని రాజుగా నొనర్చి శ్రీరామచంద్రునిం దపసియై
నారచీరలు గట్టి పదునాల్గు వర్షము లడవులలోం గాలము

గడపఁ బంపుము. ఇవియే నా రెండు కోరికలు" అని సిగ్గును, భయంబును విడిచి ప్రార్థించెను. ఆ కర్ణకఠోరంబు లగు పలుకుల కులికిపడి దశరథుం డెంతయుఁ దల్లడం బంది వివశుఁడై ధరణిపై వ్రాలెను. కొంత తడవున కతండు తెలివొంది కైకేయి నుద్దేశించి "ఓ కఠినురాలా! శ్రీరాముఁడు నీ కేమి యపకారం బొనరించెను? మాతృభక్తి పరాయణుం డగు శ్రీరామున కిదియా నీ వొనర్పందగిన ప్రత్యుపకారంబు? నిర్దోషి యగు శ్రీరాముని నే నెట్లడవికిం బంపఁగలను? రాముఁడు లేక నే నెట్లు జీవించి యుండనోపుదును? కైకా? నీ యందలి ప్రేమచే నీపాదంబులకుం బ్రణమిల్లు చున్నాఁడ. నీ నోట నిట్టి చెడుపలుకులు రానీయకుము. జ్యేష్ఠ పుత్రుండే రాజ్యార్హుండు గదా? గుణాఢ్యుం డగు రాముని నీకోర్కె ప్రకారము నేనెట్లు వనంబులకుం బంపువాఁడ? కైకా! నేను వృద్ధుండ నైతిని. ఇఁక నెక్కువ దినంబులు జీవించెద ననెడి యాశ కూడ లేదు. నాయెడ దయ చూపుము. శ్రీరాముని విడనాడుట దప్ప మఱి యేమి కోరినను మాఱు పలుకక యిచ్చువాఁడ" నని యెంతయు సౌహార్ద్రపూర్వకము లగు వాక్యములతో వేఁడికొనెను. కాని, పాషాణ సదృశ హృదయయు, నిర్దయయు నగు కైక మనస్సు మాత్రము కరఁగదయ్యె. అంత గైక దశరథుం జూచి "అవనీతలేంద్రా! నీ వత్యంత సత్య వ్రతుండవును, సాధు వర్తనుండవును. పుత్రమోహంబున సత్యంబు దప్పుట నీకుఁ దగునా? నీవు శ్రీరామునే పట్టభద్రునిం జేసినయెడ నేను వెంటనే ప్రాణంబులు

పరిత్యజించెద. అనృతవాదివై యీ పుడమినుండి శీఘ్రముగ వఘమ్ముల పాలై పొ"మ్మని నోరనాడెను.

భూపాలుఁడు దుఃఖంబునం గొంతతడవు గైకం దిట్టుచు గొంతతడ వాక్రందనంబు సేయుచు నా రాత్రి యంతయుఁ గడపెను. తూర్పుదెస తెల్లవాఱెను. శ్రీరాముని పట్టాభిషేకమునకుం గావలసిన సంభారముల సమకూర్చి మంత్రులు, సామంతనృపులు, పౌరులు గను వేడ్కతో నెదురు చూచుచుండిరి. "అన్నియు సిద్ధమయ్యెను. కాని, దశరథ రాజశేఖరుం డింకను రాఁడే"దని మంత్రియగు సుమంత్రుండు రాజేశ్వరుం డున్న కైక యంతఃపురంబున కేఁగె. అక్కడ జింతాక్రాంతుఁడై యున్న క్షితిపతిం జూచి "రాజేంద్రుం డట్లుండుటకుఁ గారణంబే" మని సుమంత్రుండు కైక నడిగెను. అందులకామె "రామా! రామా! యని యీ నృపాలుండు కలవరించుచున్నాఁడు. కావున, రాముని శీఘ్రముగఁ దోడ్కొనిర"మ్మని సుమంత్రునిం బంపె. మంత్రియు జిన్నదేవి యాజ్ఞాప్రకారము రామ సౌధంబున కేఁగి "నీ జనకుండును, బినతల్లి కైకమ్మయు నిన్నుఁ దోడ్కొని రమ్మని"రని పలుక, సంతోషంబుగఁ గాలక్షేపంబు సేయుచున్న శ్రీరాముఁడా వార్త విని తండ్రికడ కరిగి భక్తియుక్తి పూర్వకంబుగఁ గరకంజములు మొగిడ్చి యతనికి మ్రొక్కెను. అపుడు దశరథుండు శ్రీరామునిఁ గౌఁగిలించుకొని "రామా! రామా!" యని పుడమిపై నొరగెను. జానకీవరుండు జనకునిఁ దన తొడలపై శయనింపఁ జేసె

కొనియె. ఈ యవస్థంజూచి యక్కడి కాంత లందఱు ఘనం
బుగ రోదనంబు సేయ మొదలిడిరి. శ్రీరాముండు పినతల్లిం
జూచి "తల్లీ! రాజచంద్రుని దుఃఖంబునకుం గారణమేమి?
నేను దెలియక యేమయిన నన్యాయంబుగ సంచరించితినా?
తండ్రి యెందలకుఁ బలుకకున్నాఁడు? నీ వేమైనం గష్టవా
క్యంబులు పలికితివా!" యని యడగఁ, గైక "ఇనకులేశున
కేవిపత్తును రాలేదు. అతఁ డొక కార్యంబు సేయ నుద్య
మించియున్నాఁడు. నీవు దాని కడ్డు చెప్పిన నీకుఁ బాపము
గలుగు" ననెను.

అంత రాముఁడు "అమ్మా! నీ విట్టి మాట లెందుల
కాడెదవు? నే నెన్నఁడైనఁ బితృవాక్యోల్లంఘనంబు చేసితినా?
తండ్రి కోరిక యేమో తెలిపిన దానిని దప్పక నెఱ
వేర్చెద. జనకునికొఱకు భూసుతనైన, నా ప్రాణంబులనైన
నొసంగెద. కుమారుం డుత్తముండైనయెడ జనకుఁడు
తనకుఁ జెప్పక ముందే యతని కార్యము నెఱవేర్చును. మధ్య
ముండు చెప్పిన తరువాతఁ జేయును. అధముండు విధ్యుక్త
మని పలుమాఱు బోధించిన నెట్టకేలకు నెఱవేర్చును. నేను
జనకుని కోరిక సిద్ధింపఁ జేసెద. రాముఁడు మాఱుమాట
పలుకువాఁడు కాఁడని యెఱుంగుము. ఇందులకు సూర్య
చంద్రులే సాక్షు" లనెను. అంతటఁ గైక "భరతుని ధరణీ
పతిం జేసి నీవిప్పుడ నారచీరలు గట్టుకొని యడవులకుం

బొమ్మ. ఫలంబులే యాహారంబుగా ఁ బదునాల్గుసంవత్స రంబులు వనవాసంబునఁ గడపుము. ఈ సమాచారమును భూరమణుండు నీకుఁ దెలుప లజ్జించుచున్నాఁ" డని పలుక, శ్రీరాముఁ డామె పలుకులు విని కొంచె మయిన విచారింపక "భరతుఁడే రాజగును; నేను వనంబునఁ జరింతును. జనకుం డెందులకు నాతోఁ జెప్పక వగచుచున్నాఁ"డని ప్రత్యుత్తర మిచ్చెను. పితృభక్తి తత్పరుం డగు శ్రీరాముని వాక్యంబులును, క్రూరురాలగు కైక మాటలను విని "హా! రామా! నేను గాముకుండను, కలుషమానసుండను; నన్ను వధించి నీవు రాజ్యముం గైకొనుము. హా గుణాభిరామా! హా రవికులసోమా! హా జానకీ మనోధామా! నన్నుం బాసి నీవు విపినంబున కెట్లు పోయెదవు!" అని దశరథుండు పలవించుచు రామునిఁ గౌఁగిటం జేర్చుకొని కన్నుల నీరు నించెను.

జనకుని యశ్రుధారలం దుడుచుచు, "అఖిలశాస్త్ర వేత్తవు. అహితసంహారుఁడవు, అతి ధైర్యశాలివి; నీ వెందుల కధైర్యపడెదవు? నాతమ్ముండు భరతుండు రాజ్యం బేలుచుండ నేను సంతోషంబున నరణ్యంబునం దిరిగెద. ఈ రాజ్యంబుకంటె నరణ్యమే పూజ్యతరంబుగా నుండును. మా తల్లి యొద్ద కేగి మరల వచ్చెద సెలవొసంగు" మని పలికి శ్రీరాముఁడు తన పినతల్లి యంతఃపురమునుండి వెడలెను.

శ్రీరాముని యరణ్యావాస విషయంబును బురజనంబులు తెలిసికొని యాక్రందనంబు సేయుచు దశరథుని

దూషింపసాగిరి. పాపము! కౌసల్యకీ వృత్తాంతము తెలియక
రాముని క్షేమమునకై హరిపూజ చేసి బహురత్న రాసులను,
ధనంబును భూసురులకు దానంబులు సేయుచుండె. అంత,
రాముని రాకం గాంచి యామె త్వరితంబుగ నతని నక్కునం
జేర్చి ముద్దుపెట్టుకొని యానందించుచు "ఓ, రామా! క్రొమ
బ్బాంబుదశ్యామా! పట్టంపు టేనుంగుపయిం గూర్చుండి
సామంత భటజనంబులతో రాక యిపుడు నీ వొంటరిగ వచ్చు
టకుం గారణం బేమి?" యనెను.

అపుడు జానకీపతి "జననీ! భరతుండు రాజగును.
పదునాలు గబ్దంబులు నేను మునివేషంబున నారచీరలు
గట్టి యీ నగరంబు విడిచి యరణ్యమునకుం బోవలెను.
మరల శీఘ్రకాలంబున వచ్చెద; తల్లీ! చింతింపకు" మనెను.
తల్లి తల్లడం బతిశయిల్ల మూర్ఛ మునింగి యెట్టకేలకుం
దెలిసి యేడ్చుచు "తండ్రీ! నే నత్యంతమందభాగ్యను! ఎన్ని
వేల వ్రతములో యెన్నెన్ని భూరిదానములో చేసి నిన్నుం
గంటిని. ఇపుడు నిన్నుం బాసి నే నెట్లు జీవింపంగలను?
నేను నీ వెనువెంటనే వచ్చెద. నా తండ్రీ! నా మాట
వినుము. నీ వడవికిం బోవలదు. జనకుని వాక్యం బెంత పూజ
నీయమో నా మాటయు నీ కట్టిదేగదా!" యని నిట్టూర్పులు
నిగుడ్చ జొచ్చెను.

"అమ్మా! పతియే భామలకు దైవముగదా! పతిని
విడిచి చరించుట యుచితమే? భూనాథుని భావజ్ఞసిం

భూరివన్యగంబులు మున్నగు ఘోర జంతువ్రాతము గల మార్గమ స్థలములకు నీ వెట్లు రాఁగలవు? ఎండ వానల కోర్చి నీ వెట్లుండ గలవు? నీ వింటనే యుండుము. నా మాట లాలించి పాలింపుము. ఆడుదానవగు నీకెట్టి వనవాస శ్రమం దెలియవము. అంతఃపురజనం బేడ? ఘోరారణ్య నివాసం బేడ?" యని యామె మనసు మార్పఁ బ్రయత్నించెను. కాని, "నే నిన్నుఁ బాసి నిముసంబును నిలువఁజాల. అటు కాదందువేని నన్ను శీఘ్రముగ భవత్కరవాలంబున కాహారంబు చేసి నీ యిచ్చ చొప్పునం బొమ్ము. నా శరీరం బంతయు భవదధీనం"బని సీత పట్టుపట్టెను. అందువలన శ్రీరాముఁడు సీతను గూడ వెంటబెట్టుకొని పోవుటకే నిశ్చయించుకొనెను. వారు ముగ్వురుం గలసి కౌసల్యవలనం దీవనలు గాంచిన యనంతరంబు, శ్రీరాముఁడు దరిద్రులకును, బ్రాహ్మణులకును యథోచితంబుగ వివిధ దానంబు లొనరించి భృత్యులను దా మరలి వచ్చునంతవఱకుఁ దన భవనంబుననే యుండ నియమించి వారికి వలయునంత ధనం బొసంగెను. త్రిజటి యను వృద్ధ బ్రాహ్మణుఁ డొకండు దాన పరిగ్రహార్థ మేతేర శ్రీరాముఁ డతనిం జూచి "అయ్యా! విప్రోత్తమా! నీచేత నున్న యీకఱ్ఱ నెంత దూరము విసరెదవో యంతదూరము లోపలఁ గల మా యావుల నన్నింటిని నీకు దానముసేయు దు"నని వాగ్దాన మొనర్చె. వృద్ధుం డయ్యు విప్రుఁ డత్యాశచేఁ దన కడివఱకు లేని సత్త్వంబును దెచ్చుకొని చేతిలోని కఱ్ఱను బలము కొలంది విసరివైచెను. ఆ కఱ్ఱ సరయూనదిం

దాటి పడెను. ఆ యావరణములో లక్ష యావులు మేయు చుండెను. శ్రీరామచంద్రుఁడు పరమ సంతుష్టాంతరంగుండై యా యావుల నన్నింటిని మఱికొంత ధనముతోఁ గూడ నా బ్రాహ్మణున కొసంగెను.

శ్రీరాముఁ డీవిధంబుగ ననేక విధదానంబు లొనరించిన యనంతరం, బినకులేశ్వరుని కడకు వారు మువ్వురుం జని భక్తితో నతని పాదారవిందంబులకు మ్రొక్కిరి. వా రా దినంబుననే వనవాసంబునకుఁ బోవలసినందున దశరథుండు సుమంత్రుని బిలిచి ధనరత్న రాసులతో నింపఁబడిన రథంబు నాయత్తపఱుపు మని యాజ్ఞాపించెను. క్రూరాత్మురా లగు కైక "ధనం బంతయు రాముని కొసంగిన భరతుని కేమి యుండు!"నని ప్రశ్నించెను. శ్రీరామచంద్రుం "డివి యన్నియు నా కేటికి? కొన్ని జీర్ణవస్త్రంబు లొసంగినం జాలు" ననియె.

అది విని కైక మువ్వురికిం బ్రాత గుడ్డలం దెచ్చి యిచ్చెను. శ్రీరాముఁడును, సౌమిత్రియును నా వస్త్రంబులం గట్టుకొనిరి. సీతాదేవి మాత్ర మవి యెట్లు కట్టుకొనవల యునో తెలియక నిశ్చేష్టురాలై నిలువఁబడియె. అపుడు కైకేయి యామె కొసంగఁబడిన జీర్ణచేలంబుపై నింకొక నారచీరం జుట్టి యొసంగి కట్టుకొమ్మనెను. సీతాదేవి దుర్భర స్థితిం జూచి యందఱుఁ గన్నీరు నింప నారంభించిరి. అంతట వసిష్ఠమహాముని "దశరథుఁడు సీతం గూడ నార చీరలు కట్టించుటకు వర మీయలేదు గదా!" యని కైకను నిందించి

"సీతాదేవికిఁ బదునాల్గు సంవత్సరంబులకుఁ జాలిన ధనరత్న భూషణాదుల నొసంగుం" డని యాజ్ఞాపించెను.

అంతట వారు ముగ్గురు నందఱికి నాశీర్వాదముఁ నంది ప్రయాణంబయిరి. సీతాదేవిని బాగుగ నలంకరించి రథారూఢురాలిం గావించి రామలక్ష్మణులు తాము శస్త్రాస్త్రపాణులై యరదంబు లెక్కిరి. రథము కదల నారంభింపగనే మహారాజు, కౌసల్య, సుమిత్ర, పౌరులు మున్నగువారు దానిని వెంబడించి పరుగిడుచు "ఓ సుమంత్రా! రథము నెమ్మదిగా నడుపుము. మేము మిమ్ముఁ గలిసికొననేరకున్నారము" మని కేకలు వేయఁ జొచ్చిరి. వారి రోదనంబు వినఁజాలక శ్రీరాముఁడు సుమంత్రునితో "రథంబులు వేగముగఁ బోని" మ్మనెను. అంత నతఁడు రథంబును సత్వరంబుగఁ దోలెను. రథవేగంబున కోటువడి చాలమంది వెనుకకుం దగ్గిరి. రథంబు దృష్టిపథంబున నున్నంత తడవును గొంతమంది యచ్చటనే యుండి తదేకదృష్టిం జూచుచు రథంబు దృగ్గోచరంబు కాకగనే ఖిన్నులై తమతమ గృహంబులకు మరలిరి. దశరథుండు దుఃఖాతిశయంబున నేలం బడఁ గౌసల్య యతనిం బట్టుకొని లేవనెత్తి రాజమందిరంబునకుం గొనిపోయెను. కైకేయియు నాసమయంబున దశరథు నోదార్ప నచ్చెఁ గాని యతఁడామెను ముట్టుకొనవలదని కౌసల్యాంతఃపురంబున కరిగి విచారించుచుఁ బరుండెను. అదియే యతఁడు కౌసల్యామందిరంబున శయనించుటకుం దుదిదినంబు. కౌసల్యాదశరథు లానాఁడంతయు రోదనములతోనే గడపిరి.

దశరథుండు మరలి వచ్చిన తరువాతం గూడc బౌరులు చాలమంది రథము వెంటం బరువిడ నారంభించిరి. వారిలోc జాలమంది వృద్ధులును, బ్రాహ్మణులు నుండుటం జూచి శ్రీరాముcడు జాలినొంది సుమంత్రునితో "రథంబు నిలుపు"మని చెప్పి సీతా లక్ష్మణ సమేతుండుగా రథంబు డిగ్గి పౌర జనంబులతో నడువ నారంభించెను. వా రటు పాదచారులై తమసానదీ తీరంబునకు వచ్చి చేరిరి.; సాయంకాల మగుటం జేసి యా రాత్రి యచటనే నిలిచి కర్తవ్యంబు నాలోచించుచు నిద్రించిరి. వేకువజాముననే శ్రీరాముcడు మేల్కాంచి సుమంత్రుని నెమ్మదిగ మేలుకొల్పి "ఓయీ! పురజనులందఱు నిద్రించుచున్న యీ సమయముననే మనము ప్రయాణంబు సాగనిచ్చుట మంచి"యని హెచ్చరించెను. అతండు తేరాయత్తంబు సేయ వా రెప్పటియట్ల పైలుదేరి వెడలిరి.

కొంత దవ్వేగిన యనంతరంబు, పరిత్యజింపc బడిన బ్రాహ్మణాది పౌరజనంబులు చక్రమ్ముల చాలుం బట్టి తమ్మె వెంబడింపకుండుటకై "రథంబు నాలుగు వైపులకుం ద్రిప్పుమc"మ్మని రామచంద్రుండు సుమంత్రున కాజ్ఞాపించెను. ఈ తెఱంగునc బౌరజనంబులం దప్పించుకొని సీతారామలక్ష్మణులు వన మధ్యమునం బడి పోవుచుండిరి.

తమసానదీతీరంబున విశ్రమించిన పౌరజనంబులు శ్రీరాముcడు తమ్ము విడిచి వెడలినందులకు మిక్కిలి యాక్రందించుచు గాఢముగ నిద్రించినందుకుc దమ్ముc దామే

నిందించుకొనుచు రథమార్గంబు గుర్తి వసరక యయోధ్యకు మరలిపోయిరి.

దిన మంతయు రథంబు నడువ, సీతారామలక్ష్మణులు గంగానది యొడ్డున నున్న గుహుని రాజ్యంబు చేరిరి. గుహుండు శ్రీరాముని మిత్రుండు. శ్రీరాముండు వచ్చె నను వార్త వినినతోడనే గుహుం డానందపరవశుండై యనేకంబు లగు ఖాద్యపదార్థంబులతో నతని కడకుం జని పాదంబులకు నమస్కరించెను. తమ కొఱకై సకల పదార్థములం దెచ్చె నని మిత్రునకు వందనంబు లాచరించి రాముండు వాని నేమియుం గైకొనక నాఁటికి జలపానంబు మాత్రి మొనర్చె. సీతారాములు నిద్రించుచుండ లక్ష్మణుండు జాగరూకుండై వారిం గాపాడుచుండెను. గుహుండు సౌమిత్రిం జూచి "హేమపర్యంకమున హాయిగ నిద్రించు శ్రీరాముం డిప్పుడు తరుణీమణితో ధరణిం బరుండి యున్నాఁడు. ఇంతకుం గత పాత్మురాలగు కైకయేకదా కారణ" మని విలపింప జొచ్చె. "ఇలాతలంబున సంభవించు దుఃఖము లొరులవలన సంభవించునవి కావు. అవి యన్నియుఁ బూర్వకృతకర్మఫలంబులు. వెన్నెలయుం జీఁకటియుం బోలె కొన్ని దినంబులు సుఖంబును, కొన్ని దినంబులు దుఃఖంబును మానవు లనుభవింపవలసి యున్నది. ఇతరులు దుఃఖకారణు లని యెంచఁ గూడ" దని లక్ష్మణుఁడు సమాధానము చెప్పి యతని నోదార్చెను. అంతలో సౌమిత్రుండు పూర్వ దిక్కునం బొడసూపె. రాఘవుండు తనుదామరలు విప్పి చూచి తెల్లవారె నని గ్రహించి

యమ్మహానదిం దాఁటు తలంపున సుమంత్రుని "రథంబుదోలు కొని యయోధ్యకుం బొమ్మ"ని యానతిచ్చె. "రామచంద్రా! నన్నును వనవాసంబున నీతో నుండని" మ్మని సుమంత్రుఁడు రాముని వేడుకొనియె. అప్పుడు రామచంద్రుండు వృద్ధుఁడగు సుమంత్రుం జూచి "నీ విక్కడ మాతో నున్నచోఁ గైకేయీదేవి నేనరణ్యంబునకుం బోలేదని తలంచి జనకుని మిగులఁ గష్టపెట్టును. కనుక నీవు త్వరితంబ యేగు" మని యతనిం బంపివైచె.

అత్యంత దుఃఖముతోఁ గన్నీరు విడచుచు సుమంత్రుం డయోధ్యకుం బోయె. గుహుఁడు సీతారాముల లక్ష్మణులను మహానదిం దరింపఁజేసె. జానకీరమణుండు ప్రియ వాక్యములతో గుహుని బుజ్జగించి యతనిని "శీఘ్రముగ రాజ్యమునకుం బొ" మ్మని పంపె. అనంతరము వారు మువ్వురు వనమధ్యము నంబడి పోయిపోయి భరద్వాజాశ్రమము సమీపించి యమ్మునిశిష్యుం గాంచి భరద్వాజునకుం దమ రాక నెఱిఁగింపుమని కోరిరి. అతండు సంతోషమునను జని భరద్వాజ మహామునిం దోడ్కొని వచ్చెను. రామలక్ష్మణులు భరద్వాజునకుం బ్రణమిల్లి యతని యాశీర్వాదము లందిరి. భరద్వాజుండు వారల నానావిధోపచారంబుల సన్మానించి తన యాశ్రమంబున నుండుండని ప్రార్థించె. అది తాపసులకుం దగిన ప్రదేశము కాకపోవుటవలన "నిర్జనప్రదేశముం జూపుఁ" డని వారు కోరిరి. "ఇక్కడకు సమీపంబుననే చిత్రకూటాద్రి గలదు.

అది సకల పుష్ప ఫల వృక్షంబులతో నిండి కడు రమ్యముగ నుండును. ఈ కయ్యది యెంతయు వాసయోగ్యం" బని యతండు బదులు చెప్పెను. వారు భరద్వాజాశ్రమమున నొక దినంబుండి చిత్రకూటాద్రికిం బయనమై మునివర్యునకు భక్తితో నమస్కరించి సెలవు గైకొనిరి. అప్పుడు వాల్మీకి వారికిం దన వృత్తాంత మిట్లు తెలుపం దొడంగె. "పుట్టుకచే నేను బ్రాహ్మణుడ నయ్యుం జండాల కన్యక నేలి పుత్రులం గని వారి పోషణము కొఱకుం బాపకర్ముండనై సంచరించితిని. ప్రతిదినము వనమార్గమునం బోవు పథికుల తలలు పగులం గొట్టి వారి విత్త మపహరించుచుండెడివాండ. ఇట్లు కాలక్షేపంబు సేయుచుండ నొకనాండు సప్తర్షులు నా దారిం బోవుచు నేను దమ్ముంబట్టి చంపుటకు సంసిద్ధుండనై యుండ, "నీవిట్లు జనులను వేటాడి చంపుచుంటి వేల?" యని నన్నడిగిరి. నేను "దార సుతోదర పోషణార్థమై ధనమార్జించుటకే యిట్లు చేయుచుంటి" నంటిని. అంతట "నీ వందఱిని జంపి సంపాదించుచున్న పాపమునం దాము కూడ భాగస్థు లగుదురేమో నీ భార్యాపుత్రుల నడిగి ర"మ్మని వారు నన్నంపిరి. నేను వేగంబ పోయి వారి నడిగితి. "నీ వెట్లు ధన మార్జించి మమ్ము రక్షించుచున్నవాండవో మాకుం దెలియదు. ఆలుబిడ్డలం గాపాడుట నీ విధి. నీ పాపంబున మేము భాగస్థులము కానేర"మని వారు ప్రత్యుత్తరమిచ్చిరి. అంతట నేను గడగడ వణంకుచు మరలివచ్చి "పాప విముక్తుండ నగుట కుపాయం బెఱింగింపుం"డని ఋషులం బ్రార్థించితి. "అన్యచింతలు మాని

యనవరతము రామనామము జపించుచుండు వేని నీపాపము లన్నియుం బాయు" నని చెప్పి వారు తమ మార్గమున నేగిరి. నేనప్పటినుండియుఁ దపస్సు చేయ నారంభించితిని. నా దేహమంతయుఁ బుట్టలతో నిండె. ఇట్లు బహుసహస్ర శతాబ్దములు గడచిన పిదప మరల సప్తర్షులు నాకడకు వచ్చి తమ రాకం దెలియఁబఱచిరి. అప్పుడు నేను వల్మీకంబు నుండి వెడలివచ్చి వారికి మ్రొక్కితిని. వారు "రామనామజప ప్రభావము వలన బ్రహ్మర్షి వైతి" వని నన్నాశీర్వదించి దివి కేగిరి. భవన్నామ జప ప్రభావము వలననే నే నింతటివాఁడ నయితి" నని వాల్మీకి శ్రీరామునికి నమస్కరించెను.

వాల్మీకి మహాముని దగ్గఱ సెలవుఁ దీసికొని వారు చిత్రకూటపర్వతంబునకుం బోయిరి. అక్కడ లక్ష్మణుండు లతా పత్రింబులతో నొక దివ్యకుటీరంబు నిర్మించె. చిత్రకూట పర్వత పార్శ్వమున నే మందాకినీ నది ప్రవహించుచుండును. నదీతీరమునందే తమ పర్ణశాల యుండుటవలన వారు ప్రకృతి శోభలం జూచుచు సంతోషమునఁ బ్రొద్దుపుచ్చుచుండిరి. కనక సౌధాంతరంబులందు నివసించువారి కిపుడు పర్ణకుటీరంబు నివాసయోగ్యం బయ్యె.

సుమంత్రుం డయోధ్యానగరంబునకుం గడుంగడు జింతాక్రాంతుఁడై మరలివచ్చి వెంటనే దశరథ భూకాంతుని చరణంబులకుఁ బ్రణమిల్లెను. సుమంత్రునిం జూడఁగనే దశరథునకు దుఃఖంబు మితిమీఱి నిశ్చేష్టితత్వముం గలిగించె.

అతండు మూర్ఛనంది కొంత తడవునకుం దెలిసి సుమంత్రుం
బిలిచి "నీవు మరలి వచ్చునప్పుడు శ్రీరాముండును, సీతయు,
లక్ష్మణుండును నేమియుం జెప్పిరా?" యని యడిగెను.
అంతట సుమంత్రుండు "రాజా! శ్రీరాముఁడు మీ కండఱికిం
వేరువేరు వరుస వందనంబు లని చెప్పె. మఱియు "నెల్లప్పుడు
జనకుని సేవం జేయుచుండు" మని జననికిం జెప్పు మనియె.
"రాజవై పితృదేవుని సగౌరవంబు సేయువల" దని భరతు
నితోఁ జెప్పుమనియె. లక్ష్మణుం డాగ్రహాపరవశుండై "జనకుఁ
డెప్పుడు నా ప్రియ సోదరు నడవికిం బంపెనో అతని యెడ
నా కుండెడి భక్తి యప్పుడే పోయిన" దనెను. సీతాదేవి
యేమియుం జెప్పలేదు. ఆమె నేత్రములనుండి దుఃఖ బాష్ప
ములు జారఁజొచ్చె" నని యచటి యుదంత మాతయు విశ
దీకరించె.

దశరథనృపాలుండు శోకవార్ధి మునింగి "హా! తనయా!
హా! తనయా!" యని విలపింపసాగెను. ఋషిశాపంబు జ్ఞప్తికి
రాఁ దన కంత్యదశ సమీపించిన దని నిశ్చయించుకొనెను.
అతఁడాతురుండై నిట్టూర్పులు నిగుడ్చుచు శాపవృత్తాంతముం
గౌసల్యకిటు తెలుపం దొడంగె: "ఓ సతీమణీ! ఒకనాఁ డడ
విలో గాఢనిశీథినియందు నేను వేఁట తమకంబున నుండ,
దగ్గఱ నున్న యొక కొలనునుండి బుడబుడ ధ్వని వినంబడియె.
అది గజ ఘీంకార మనుకొని యొక శరంబు దానివైపు విసి
చితి. ఆ శరపాతంబు వెంటనే "హా! హా!" యను నార్త
నినాదంబు వినంబడె. అది యేమో యని త్వరితంబుగ

నక్కుడకుఁ బోయి చూడ, సచ్చరిత్రుం డగు నొక ముని పుత్త్రుండు బాణనిహతుఁడై కాన్పించె. "నన్ను మన్నించి కరుణింపు" మని యతనిని మిక్కిలి భయంబున వేఁడుకొంటి. "ఓ రాజా! చింతింపకుము. అంధు లయిన నా వృద్ధ జననీజనకులకీయుదకం బిచ్చి నిన్నాశీర్వదించుకొనుము. వారు సచ్చరిత్రులు. నిన్ను క్షమింతురు; నీవు శీఘ్రమేపొ"మ్మని యమ్ముని పుత్త్రుండు దుస్సహబాధావశంబునం బలుకలేక పలికి తన ప్రాణంబు లచ్చటనె విడిచె. ఉపాయాంతరంబుం గానక వేగముగ జలముం దీసికొని పోయి ఋషి దంపతుల దాహంబు దీర్చితి. పిదప జరిగిన వృత్తాంతం బంతయు వారి కెఱింగించితి. ఆ వృద్ధులు మిక్కిలి దుఃఖించి "నీవును నాత్మజ దుఃఖమున నే మరణింతు" వని నన్ను శపించి శోకాతిరేకంబున శరీరంబులు విసర్జించిరి."

ఇట్లా వృత్తాంతంబంతయుం దెలిపి దశరథమహారాజు "హా! రామా! హా! కౌసల్యా! హా! సుమిత్రా! ఓ పాపిష్ఠురాల వగు కైకేయీ!" యని హాహాకారంబులు సేయుచు శ్రీరాము నడవికిం బంపిన యాఱవనాఁటి రాత్రి రెండు జాముల వేళఁ బ్రాణములు విడిచెను.

పౌరు లందఱు శ్రీరాముని యరణ్యవాసమునకే విలపించి, విలపించి శుష్కించియుండ. మహారాజు మరణవార్త వారిని మఱింత దుఃఖాక్రాంతులం జేసి పీడింపఁజొచ్చె.

పితృకర్మంబులు చేయుట కొఱకు పుత్త్రుండు నింట లేనందున, వసిష్ఠుండు మృతకళేబరంబును తైలపక్వంబు గావించి భద్రపఱచి భరత శత్రుఘ్నులకొఱకు నుత్తమ భటులం బంపె. భటులు వాయువేగంబున గిరివ్రజమునకుం జని "భరత శత్రుఘ్న కుమారులారా! మా వెంట శీఘ్రంబుగ రండు. త్వరితంబుగ మిమ్ముఁ దోడ్కొని రండని వసిష్ఠుండు మాకాజ్ఞాపించె"నని విన్నవించిరి. మేనమామ యనుమతిం బడసి భరత శత్రుఘ్నులు భటులతో నేడవనాఁటికయోధ్యం జేరిరి.

పాడువడిన భవనంబులును, వాడఁబాఱిన భట వదనంబులును, నిర్జన రాజమార్గంబులును జూచి భరతుండు భయకంపితుండై త్వరితముగఁ దల్లి యిల్లు సేరి యామెం గాంచఁగనే, "నా ముద్దు బిడ్డా! నా తండ్రి కుశలియే? నీవు క్షేమమ్మున నుంటివా? మార్గమధ్యంబునఁ గష్టంబు లెవ్వియుం బ్రాప్తింపలేదుకదా?" యని కైకేయి కుశల ప్రశ్నంబు గావించె.

అంతట భరతుండు "అమ్మా! నన్నింత తొందరగ బిలిచికొని వచ్చుటకుం గారణంబేమి? తల్లీ! పార్థివుండేడీ?" యని యడిగెను. అప్పుడామె "జనపతి దివంబున కేగె. శ్రీరాముఁడు సీతా లక్ష్మణులతో నరణ్యమునకుం బోయె. నిన్ను రాజ్యాభిషిక్తునిం జేయుటకే యివి యన్నియుం జమత్కారంబుగఁ బన్నితిని. కనుక నీవు సుఖముగ రాజ్యంబేలు" మని సుతుని బుజ్జగించెను. భరతుండు కైకేయి చేసిన తంత్రం బంతయు దెలిసికొని ఘనంబగు శోకంబున మునిఁగి తల్లిం

పరిపరి విధంబుల నిందింప మొదలుపెట్టెను. భరతునియందు దుఃఖక్రోధంబులు తీవ్రంబై యుండె. కైకేయి తల్లియే కాని యెడల నిశ్చయముగ నతఁ డామెం జంపి యుండును. "నీవు రాజకులమందుం బుట్టి, యిట్టి కార్య మెట్టు లొనర్చితివి? నిన్ను సోదరుం డెంత భక్తితోఁ జూచెడివాఁడు! అతఁడు నిన్నెంత గౌరవముతోఁ జూడనియెడల నిన్నిప్పుడే గృహంబు నుండి వెడలఁగొట్టెడివాఁడు. నీవు తలపెట్టిన కార్య మెప్పటికిని సిద్ధింపనీయను. నీ వగ్నిం బడి చావరాదా?" యని భరతుండు కైకేయిం దిరస్కరించి విశేషంబుగ దూషించె. అతండు తల్లి నిట్లు తిట్టి యనుజ సమేతంబుగఁ గౌసల్యయొద్దకుం జని బాష్పాకుల నేత్రుండై యామెకు మ్రొక్కి నిలువంబడె. అప్పు డామె "నీకిది దుఃఖ సమయంబు కాదు. ఘనం బగు రాజ్యలక్ష్మిని నీకై నీ తల్లి సమకూర్చినది. నీవు సుఖంబుగ నుండుము. నన్ను రాముని కడకుం బంపివేయు" మని కర్ణ కఠోరంబుగ నిష్ఠురోక్తులాడెను. కౌసల్య పలుకులు ములుకులవలె నతని మనస్సున నాటి యతనిం గలఁతపఱచెను. అంత భరతుండు దుఃఖం బాపఁజాలక రోదనంబు సేయుచు నామె పాదములకడ మూర్ఛిల్లె. అది చూచి కౌసల్య యతనిం గ్రుచ్చి యెత్తి యక్కునం జేర్చుకొని తానును రోదనంబు సేయఁ దొడంగె. వసిష్ఠుండు భరతు నోదార్చి "నీ విట్లు దుఃఖింపవలసిన పనియేమి? అఱువదివేల సంవత్సరంబు లవ్యాహతంబుగ రాజ్యపాలనం బొనరించి సత్కీర్తిం గాంచి జనకుండు దివంబున కరిగె. కనుక సత్వరంబుగఁ బ్రీతిమై రాజు

నకుం బ్రేతసంస్కారం బొనరింపు" మని హెచ్చరించె. అగ్ని కార్యంబు లన్నియు వసిష్ఠానుమతంబున నెఱవేఱె. చరమ క్రియ లన్నియుం గ్రమంబుగ విధ్యుక్త ప్రకారంబు జరిగిన యనంతర మొకనాఁడు భరతశత్రుఘ్నులు కర్తవ్యముంగూర్చి ప్రస్తావించుకొనుచుండ, మంథర నానావిధ భూషణాలంకృతయై సఖీబృందముతో భరతునికడ కేతెంచెను; తాను జేసిన ఘన కార్యంబునకు భరతుండు తన్ను గౌరవించునని యెన్ను కొనెను. భరతుండు మంథరం గాంచి సర్వానిష్టములకు నిదియే కారకురాలని దానిని వధింపు మని శత్రుఘ్నున కాజ్ఞాపించెను. అతండు దానిం గ్రిందఁ బడవైచి పిక్కలు విఱుగ శిక్షించెను. అందుల కది సహింపనోపక కేకలు వేయ సాగెను. అప్పుడు భరతుండు "తమ్ముఁడా! ఇఁకఁ జాలు. స్త్రీలం గొట్టిన శ్రీరాముని కాగ్రహంబు వచ్చు" నని శత్రుఘ్నుని నివారించెను.

దశరథుండు మరణించి యిప్పటికిఁ బదమూఁడు దినంబు లయ్యె. కాని, యిప్పటి కెవ్వండును రాజు లేఁ డయ్యె.

భరతుండు తా నేవిధముననైన శ్రీరామునిం గొని తెచ్చెదనని గురు మాతృ భట భ్రాతృ సమేతుండై ప్రయాణ మయ్యెను. అయోధ్యాపుర జనులందఱు శ్రీరామునిం గొని తెచ్చుటకు భరతునితో బైలు దేఱిరి. వీరందఱు గంగానది యొద్దు చేరఁగనే భరతుఁడు శ్రీరాముని కేదైన నపకారంబు సేయ నేతెంచు నేమోయని సంశయించి గుహుండతని నడ్డ

గించుటకుఁ బోయెను. భరతుండు శ్రీరాముని దీసికొనిపోవు తలంపుననే వచ్చినవాఁడని చతురంబుగఁ దెలిసికొని గుహుం డతని జాహ్నవీనది నుత్తరింపఁజేసెను. భరతుం డంతటఁ దన యనుచరులతో భరద్వాజాశ్రమంబునకుం బోయె. అతండు శ్రీరాముని దోడ్కొని యేతెంచుటకే యేగుచున్నాఁడని యోగదృష్టిం దెలిసికొని భరద్వాజుండు మిక్కిలి మీఱిన యానందంబున మునింగి తన యాశ్రమంబున వారి కెల్లరకు విందు బోనసంగఁ దలంచె. పౌరు లందఱు "ఇతండు మనకు విందు లెట్లు సమకూర్చు?" నని యాశ్చర్యపడిరి. అతని తపః ప్రభావముచేతనే వివిధాహారంబులు సంసిద్ధము లయ్యె.

అనంతరము భరద్వాజుండు వారికిఁ జిత్రకూటాశ్రమ మార్గముం జూపె. భరతుం డమ్మునికడ సెలవుఁ గైకొని శ్రీరాముఁ డున్న చిత్రకూట పర్వతమునకుం బోవం బయనమయ్యె. భరతుండు వచ్చుచున్నాఁడని రామ లక్ష్మణులు దూరమునుండియే ప్రజల కలకలంబులవలనం దెలిసికొనిరి. లక్ష్మణుం డొక వృక్షం బెక్కి పరికించి చూచి భరతుండు తమ్ముం జంపుటకే సేనాసమేతుండై వచ్చుచున్నాఁడని భావించి తన సోదరుని ధనుర్బాణధారిం గమ్మని హెచ్చరించెను. మఱియు నీ దినంబున వారి నందఱిం జంపి తీరవలయు ననియుం బంతము పట్టెను. "లక్ష్మణా! తమ్ముఁడు భరతుండు మన కెన్నఁడైన నపకారం బొనరించినాఁడా! నీవు శీఘ్రముగఁ జెట్టు దిగు" మని శ్రీరాముఁడు మందలిం

చెను. సీతారామలక్ష్మణులు మువ్వురు నచ్చట లుండుచుండ, భరత శత్రుఘ్నులు వచ్చి సోదరుల నాలింగనము చేసికొని యాక్రందింప నారంభించిరి. దశరథుని మరణవార్త విని దుఃఖించి సీతారామ లక్ష్మణు లతనికిం దర్పణంబు విడిచిరి. భరతుఁడు శ్రీరాము నయోధ్యకు మరలి రమ్మని ప్రతి మాలుకొనెను. "ఎన్నివిధంబుల నెవ రెంత చెప్పినను పితృవాక్యోల్లంఘనమున కియ్యకొన" నని శ్రీరాముఁడు నొక్కి వక్కాణించె. "సోదరా! నిన్ను రాజ్యము చేయు మనియు, నన్నుఁ బదునాలు గబ్దంబులు వనవాసిగ నుండు మనియు జనకుఁ డాజ్ఞాపించెం గాన మన మిద్దఱము నాని యాజ్ఞం బరిపాలింత" మని శ్రీరాముఁడు భరతునకు నచ్చఁ బలికెను. భరతుండు తాను రాజ్యంబు సేయు ననియుఁ, దన యన్న పేరనే చేసెద ననియు శ్రీరామచంద్రుని పాదుకలం దీసికొని పట్టపు టేనుంగుపైఁ బెట్టి సపరివారంబుగ నయోధ్యకు మరలి చనియె. భరతుం డచ్చట రాణుల దిగవిడిచి మంత్రి పుంగవులతో సమీపమున నున్న నందిగ్రామమునకుం బోయె. తన యన్న పాదుకలను సింహాసనంబునఁ బెట్టి యే కార్యము నయినఁ జేయవలసి వచ్చినపు డా పాదుకలకు విన్నవించు చుండువాఁడు. మహారాజునకుం జేయవలసిన సమస్తోపచారం బులు వానికే చేయుచుండెను.

తా నచ్చట నుండిన భరతుండు మరల మరల వచ్చు నను భయంబున, శ్రీరాముఁ డా యాశ్రమంబు విడిచి భార్యా

భ్రాతృ సమేతంబుగ నత్రిమహాముని యాశ్రమంబునకుం బోయె. అత్రిమునిం బోలియు, నతని భార్య యనసూయా దేవిం బోలియు ధర్మశీలంబును, మహానుభావత్వమును గలవా రుండుట మిక్కిలి యరుదు. సీత స్వభావంబునకు మెచ్చి యనసూయాదేవి యామెకు వస్త్రాలంకారంబుల నిచ్చె. ఋషి దంపతుల యాశీస్సులం బడసి వారు మఱియొక వనంబునకుఁ బోయిరి.

---

శ్రీ ర స్తు.

# సీ తా రా మ ము.

## మూఁడవ ప్రకరణము.

శ్రీరామాదులు ప్రవేశించిన క్రొత్తవనము భల్లూక శార్దూల మార్తిం గ్రమముగ ఘోర మృగాకులంబును, బహుళ పన్నగావృత మహీరుహ నిబిడంబును, అంధకార బంధురంబును, బహువిధ పక్షికుల కలకలంబును, వివిధ లతా పరి వేష్టితంబును, విశేష కంటక పాషాణ సమన్విత ప్రదేశంబును, క్రూర రాక్షస సమాకీర్ణంబునునై యతిభయానకం బయ్యె, అక్కడక్కడం గల దమూర్ధ్రిహృదయులును, ధర్మశీలురు నగు మునులచే చిత్తాకర్షకంబుగ నుండె.

ఋష్యాశ్రమంబు లన్నియు సందర్శించి వారి గభీరా రణ్యముం బ్రవేశించినతోడనే యొక ఘోరాకారుం డగు

రాక్షసుండు వారికిం బొడగట్టెను. వాని పేరు విరాధుండు. వాడు యముని బోలు నాకృతియుం, బర్వత సమం బగు వికృత దేహంబును గలిగి రక్త మాంస మిళిత మయిన యొక వ్యాఘ్రచర్మంబు ధరించి భయంకరంబుగఁ దోఁచె. అపుడు నిశాచరుండు నాహారంబుగ మూఁడు సింహంబులను, నాలుగు వ్యాఘ్రంబులను, ఒక గజంబును, పది హరిణంబులను దగ్గఱం బెట్టుకొని తినుచుండెను. అవి యతని యుదరంబు నింపం జాలు నని తలంపరాదు. సీతా రామలక్ష్మణులు లా దారిం బోవుచుండ విరాధుండు సీత నెత్తుకొని పోయెను. అంత శ్రీరాముఁ డాహారనంబులు వెలువడ రోదనంబు సేయం దొడంగె. అపుడు లక్ష్మణుండు "అన్నా! నీవు చాల సాహసంబు గలవాఁడవే. ఇపు డీ యిందుల కేడ్చు చున్నాఁడవు? నే నిప్పుడే దైత్యుం దునుమాడెదం జూడు" మనియె.

సౌమిత్రి వచనంబులు విని విరాధుండు "మీ రెవ్వ!" రని యడిగె. శ్రీరాముఁడు "మేము క్షత్రియుల" మని బదులు చెప్పి "నీ వెవ్వండవు?" అని ప్రశ్నించెను. "నేను విరాధుండను. న నెవ్వరుం జంపఁజాల" రని వాఁడు ప్రత్యుత్తర మిచ్చెను. శ్రీరాముఁడు బాణ సహస్రంబు వానిపైఁ బఱపె, అంతట నాక్రవ్యాదుండు సీతాదేవిం గ్రిందఁ బడ వైచి రామలక్ష్మణులతోఁ ఘోర యుద్ధంబు సేయ సన్నద్ధుం డయ్యె. రామలక్ష్మణు లెన్ని శరంబు లరవడిమై విడిచినను, అవి పరమేష్ఠి వరంబు వలన వాని కెంతమాత్రముం దగుల

కుండెను. రామలక్ష్మణులు బాణంబులు వ్యర్థ మగుటం గాంచి విగ్రహస్థులై యుద్ధము సేయ నుంకింప, వాఁడు వారి నిరువుర నిరుగేల నిఱికించుచు, భుజములపై నెక్కించుకొనెను. సీత భయార్తయై "ఓ పుణ్యజనుఁడా! నా నాథుని, మఱందిని విడిచి నన్నుం బట్టుకొని భక్షించి పుణ్యంబు గట్టుకొను" మని విలపింపఁజొచ్చెను. ఇరువురు వాని భుజద్వయంబు ఖండించిరి. వెంటనే విరాధుండు భూతలంబు చలింపఁ బాపుగ నని యఱచి నేలంబడి మూర్ఛిల్లె. "ఆహా! వీఁడేవిధంబుచేతను జచ్చుటలేదు. మన శస్త్రాస్త్రంబులు నిష్ప్రయోజనంబు లయ్యె. వీనిం గోతం బాఁతవలయు" నని రామలక్ష్మణులు నిశ్చయించుకొనుచుండ, దైత్యుండు వారింజూచి "అయ్యా! ఇప్పుడు మీరు రామలక్ష్మణులని తెలిసికొంటిని. నేను పూర్వజన్మంబున గంధర్వుఁడను; కుబేరశాపంబున దేవవిరోధినై జన్మించితిని. మీవలన నాకు శాప విముక్తియగు నని కుబేరుండు చెప్పె" నని తన వృత్తాంతముం దెలిపె. తోడనే వారు వానిని నేలం బాఁతిరి. తరువాత సీతా రామలక్ష్మణులు శరభంగమహాముని యాశ్రమంబునకుం బోయిరి. ఇంద్రుండు శరభంగ మహాముని తపంబునకు మెచ్చి పంతు ప్రాంతరంగుండై యతనిని స్వర్గమునకుం దీసికొని పోవ వచ్చెను, అతఁడు శ్రీరామునిం జూడవలయు నను నభిలాషంబున నాకంబున కరుగ నిష్టపడండయ్యె. అతఁడు శ్రీరాముని సందర్శించి తన కింక నీలోకంబునం దుండుట యనావశ్యకం బని యగ్నిహోత్రముం బ్రజ్వలింపఁజేసి దానం బ్రవేశించె.

ప్రవేశింపఁగనే తన వృద్ధశరీరంబు నశించి శరభంగుండు సుందర విగ్రహంబు గల బాలుం డయ్యె. అంతట నతండు రామలక్ష్మణులను సుతీక్ష్ణ మున్యాశ్రమంబునకుం బొండని తాను బ్రహ్మలోకంబున కరిగె. శరభంగముని దివి కరుగఁగనే పలువురు మునులు శ్రీరాముం జూచుట కేతెంచిరి. అప్పుడు రామలక్ష్మణు లమ్మునీంద్రులు రాక్షసులచే నవయుచుండుటను విని దురాత్ముల బోరిగొందు మని వారి కభయం బొసంగిరి.

శ్రీరాముఁడు జనకితోడను, లక్ష్మణుతోడను సుతీక్ష్ణ మున్యాశ్రమమునకుం బోయె. అమ్ముని శ్రీరాము నెల్లప్పుడుం దనయొద్దనే యుండుమని ప్రార్థించెం గాని స్థలాంతరమందలి మునులం జూడఁగోరి యతనియొద్ద సవినయంబుగ సెలవుం గైకొని శ్రీరాముఁడు దండకారణ్యమునకుం బయనమయ్యె. సీతారామలక్ష్మణులు దండక వనమందలి మున్యాశ్రమంబులన్నియు దర్శించుచు బది సంవత్సరము లచ్చటఁ గాలక్షేపంబు సేసి మరల సుతీక్ష్ణాశ్రమముం జేరిరి. వారు సకల మునీంద్రులను సందర్శించిరి గాని, యగస్త్యముని దర్శనంబు మాత్రము వారికి లభింపక పోయెను. వారు మరల సుతీక్ష్ణుని యనుజ్ఞం గైకొని యగస్త్య మహాముని యాశ్రమంబునకుం బోయిరి. అగస్త్యముని ఋషులలో మిగుల గొప్పవాఁడు. అతం డనేక కాద్భుతకార్యంబు లొనరించినవాఁడు. సముద్రం బంతయు నొక్క గుక్కగాఁ గ్రోలెను; ఇల్వల వాతాపులను రాక్షస ద్వయంబును మిగుల జమత్కారంబునఁ

జంపెను. ఇల్వలుండును, వాతాపియు నన్నదమ్ములు. ప్రతి దినంబును బ్రాహ్మణులం జంపి తినుటయే వారి పని. ఇల్వలుండు బ్రాహ్మణవేషంబు ధరించి సంస్కృతభాషణంబు లాడుచు దారింబోవు విప్రుల మోసపుచ్చి తన గృహంబునకుం దీసికొనిపోయి వారికి మేఁక మాంసపు నాహారంబుగ నిచ్చువాఁడు. అతని సోదరుం డగు వాతాపియే యా మేష స్వరూపముం దాల్చెడివాఁడు. బ్రాహ్మణ భోజనానంతరం బిల్వలుండు 'వాతాపీ' యని తమ్ముని బిలువఁగనే యతండు బ్రాహ్మణుని యుదరంబు వ్రక్కలుచేసికొని వెడలెడివాఁడు. వా రుభయులు తాము చంపెడి విప్రుల మెక్కుచుండువారు. ఈ క్రూరాత్ములం జంప నెంచి యగస్త్యుండు భోజనార్థమై వారి గృహంబున కేఁగెను. యథాప్రకార మిల్వలుండగస్త్యునకు భోజనంబు పెట్టి 'వాతాపీ' యని పిలిచెను. అగస్త్యముని "వాతాపి యెక్కడనుంచి వచ్చును? వానిని నేను గర్భంబున జీర్ణము చేసికొంటి" నని బదులు చెప్పెను. ఆ వాక్యంబులు విని యిల్వలుం డగస్త్యుం జంపఁబోయెను. కాని, కుంభసంభవుం డిల్వలుని వంకఁ దీక్ష్ణదృష్టిం జూచి వాని భస్మీభూతునిం గావించె.

అట్టి మహిమతోఁ గూడిన యగస్త్యుండు విశ్వకర్మ నిర్మితంబులగు కార్ముకము, ఖడ్గము మొదలగు కొన్ని యస్త్రములు శ్రీరామునికిం బారితోషికంబులుగ నొసంగె. శ్రీరాముఁడగస్త్యునకుం బ్రణమిల్లి "యందమయిన యొక నిర్మితస్థలంబు

చూపుఁ" డని ప్రార్థించె. అతండు "పంచవటీ వనంబు సముం
చితం" బని వచించె.

అంతట సీతారామలక్ష్మణులు నానావిధ ఫల పుష్ప లతా
వితానంబులచే నలంకరింపఁబడి చల్లని తావుల వెదఁజల్లు
తరుసంతానంబులతోడను, సరోవర నికరంబులతోడను జెలు
వొందుచు వాసయోగ్యంబుగ నున్న పంచవటీ ప్రాంతమునకుం
బ్రయాణమైరి. మార్గమధ్యంబున వారికి జటాయు వను నొక
పక్షివరుండు గాన్పించెను. ఆ పక్షిరాజుం జూచి శ్రీరాముఁడు
"నీ వృత్తాంతం బెఱింగింపు" మన "నేను జటాయువును; నీ
జనకుని మిత్రుండను. నా సోదరుని పేరు సంపాతి; గరుడుండు
మా పెద్దతండ్రి; మీరు నాయొద్దనే యుండుఁడు. మీరు కంద
మూల ఫలాదులకై వనంబునం గ్రుమ్మరు సమయంబున నేను
సీతాదేవిం గాచుచుండెద" నని ప్రత్యుత్తర మిచ్చెను.

రామలక్ష్మణులు జటాయువునకు నమస్కరించి యతని
సాదర వాక్యంబులకు సంతుష్టాంతరంగులైరి. ఆ స్థలం బత్యంత
రమణీయంబుగ నుండెను. దగ్గఱనే గోదావరి ప్రవహించు
చుండెను. హంస సారస మయూర క్రౌంచాది నానా విధ
పక్షిజాతంబు గౌతమీ ప్రవాహంబున విహరించుచుండెను.
ఇరుప్రక్కల దివ్యమైన పర్వతంబులు ఫల పుష్ప లతావృతంబు
లగు వృక్షంబులు విరాజిల్లుచుండె. హరిణంబులు నిర్మలోద
కంబుఁ ద్రావుచు స్వేచ్ఛావృత్తిం జరించుచుండె. మయూరం
బులు వృక్షాగ్రంబుల నధిరోహించి షడ్జమస్వరంబున వనలక్ష్మి

కానందంబు సంతరించు చుండె. కోకిలలు తమ మధురకంఠస్వరం బులతో నప్పటప్పటికి శ్రీవరునానందముగ స్వాగతం బొసంగు చున్నట్లుండె. ఇట్టి యాహ్లాదకరం బగు స్థలంబున నివసించుట కెవ్వరి కిచ్ఛ జనింపదు? అచ్చో లక్ష్మణుం డొక యాకుటిం టిని నిర్మింప వా రందు నివసించిరి.

ఇట్లు వా రానందాంబుధిని మునింగియుండ, విధిప్రేర ణంబున దుఃఖకారకురా లగు శూర్పణఖ యయ్యెడ కేతెంచె. రావణ సోదరియగు శూర్పణఖ శ్రీరాముని జూచి మోహించి "నన్ను వివాహంబు చేసికొ" మ్మని యతనిం గోరెను. అందులకతండు "సుందరీమణీ! నాకుం బత్ని యున్నది. నీవు పోయి రూపవంతుం డగు నా తమ్ముని వరింపు"మని మంద హాస పురస్సరంబుగ వచించె.

ఆ మాటలు నిజ మనుకొని శూర్పణఖ లక్ష్మణుని యొద్ద కేగి తన మనోభిలాషంబు వ్యక్తీకరించె. అంత నతం "ఇంతీ! నేను శ్రీరాముని దాసుండను. నన్నుం జేపట్టిన నీవు నతని దాసి వగుదువు. దాన నీకు లాభంబు లేదు. కనుక నీవు శ్రీరాముని వివాహము చేసికొనిన, నేను నీకుం గూడం బరిచర్య సల్పుదు" నని పలికి దాని బంపివైచె.

లక్ష్మణుని వాక్యంబు లాలించి శూర్పణఖ మరల శ్రీరాముని యొద్ద కరుగ, అతండు సమ్మతింపక పోయెను. అపుడది యాగ్రహాపరవశురాలై "ఈ సీత చెంత నున్నంత వఱకు రాముఁడు నన్నుఁ జేసుకొనం"డని యెంచి సీతాదేవిం

చావ నుంకించె. లక్ష్మణుండు రామానుజ్ఞాతుండై దానికి కర్ణనాసికంబులం గోసివైచె. అంతట రక్కసి మిక్కుటంబుగ రోదనంబు సేయుచు సమీపజనస్థానమం దున్న సోదరుండగు ఖరునికడకుం బోయె. అతండు శూర్పణఖ యవస్థఁగాంచి క్రుద్ధుండై "ఇది యేమి? ఎవ్వరు నిన్నిట్లు వికృతరూపిణిం గావించిరి? త్వరితంబ చెప్పుము వారిని నేను ఖండించి తగిన శిక్ష గావించెద" ననియె.

శూర్పణఖ రోదనంబు సేయుచుఁ దన పరాభవ ప్రకారంబు సర్వంబుఁ దెలియఁ బఱిచి రామలక్ష్మణుల రక్తముం దనకుఁ ద్రావఁ దెచ్చి యిమ్మని సోదరుం బ్రార్థించె. అపుడు ఖరుండు పదునల్వుర రాక్షసులను "శ్రీరాముం జంపి రం"డని యాజ్ఞాపించెను. వారట్లే శూర్పణఖతో వచ్చుటకుం బోయిరి. ఘోర రాక్షస సంహారంబుఁ గావించిన శ్రీరామున కీ రాక్షసు లెంతటివారు? రౌద్రాకారంబుల నేతెంచిన ఖరప్రేరితులగు రాక్షసులతో యుద్ధంబు చేసి రామలక్ష్మణులు వారిం బరిమార్చిరి. రాక్షసులు యమ పురంబుఁ జేరినతోడనే శూర్పణఖ త్వరితంబుగఁ దన సోదరుని కడకు మరలఁ బోయెను. దానిం జూచి ఖరుండు "ఏమి జరిగినది? రాముని రాక్షసులు చంపిరా?" యనుడు, "అన్నా! నీచే నియుక్తులైన రాక్షసులు నిహతులైరి. కావున నీవే వారిం దునుమాడ రమ్మ"ని యది బలవంత పఱిచె. అతండు చతుర్దశ సహస్ర సేనాపరివృతుండై శ్రీరాము మార్కొనం బోయె.

శ్రీరాముఁడు వారి రాకం గాంచి సీతాదేవిని లక్ష్మణునితో నొక పర్వత గుహకుం బంపి తానే యుద్ధము సేయుటకు సంసిద్ధుఁ డయ్యెను. దైత్యు లందఱు శ్రీరామచంద్రునిపై శరపరంపరలు గురియింప దొరంకొనిరి. కాని, యతం డందఱు నాశ్చర్యపడునట్లు యుద్ధంబున నందఱం దెగటార్చెను. యుద్ధంబు పరిసమాప్తి గా వేగమే సౌమిత్రి సీతం దోడ్కొని వచ్చి రాముని సన్నిధానముం జేర్చె. సోత్కంఠంబుగ నాథునిం గౌఁగిలించుకొని సీత సుప్రీత యయ్యెను. అంతట శూర్పణఖ రయంబున లంకకుం జని తన యన్న యగు రావణుని సన్నిధి కేగ, దశకంఠుం డా యువిదం గాంచి “నిన్నిట్లు చేసినవాఁ డెవండు? శక్రుఁడా? చక్రధరుఁడా? నన్నుం గానక నిన్నిట్లు పరాభవించినవాఁ డెవండో నుడువుము. నేను వానిని యమాలయంబునకుం బంపెద”నని ముద్దు చెల్లెలి నోదార్చె. అపుడా రక్కసి “నా వికృత రూపమునకుం గారకుండు రాముఁడను రాజకుమారుండు. అతండే జనస్థానంబు నందలి సర్వ రాక్షసగణంబును ఖర త్రిశిర సమేతంబుగాఁ బొరిగొనియె” నని దీనాలాపంబులం బలికె. రావణుం డత్యుగ్రుండై “ఆ రాముఁ డెవ్వాఁడో? అసురుల నెందులకుం జంపెనో? తెలిసికొందు” నని పండ్లు పటపటం గొఱికె.

మఱియు, శూర్పణఖ భువన మోహినియగు సీతాదేవి సౌందర్యంబును బొగడుచు “అన్నా! యామెను నీకు భార్యగాఁ జేయ నెంచి, తదర్థమై పోవుటం జేసియే నాకును, దక్కిన రాక్ష

సులకు నీవిపత్తు ప్రాప్తించె' నని యతని శత్రుసంహారదీక్ష నిను మడించె. సీత నెట్టయినం దనకుం గూర్పుమని పరిపరి విధంబుల రావణుండు చెల్లెలిం గోరి, ఆమె నపహరింప పన్నాగంబున మారీచుని కడకుం బోయె. మారీచుం డెన్ని విధంబుల శ్రీరామ మాహాత్మ్యంబును బోధించి. సీతాపహరణ ప్రయత్నంబు వలదనినను, రావణుండు వినకపోయెను. మఱియు, శ్రీరాముండు బాల్యావస్థ యందే రాక్షసుల వధించి తన్నొక బాణంబున విక్షేపితు నొనరించి యుండెనో ఒడవె చెవనియు నప్పటినుండి కౌసల్యాసుతుం డనిఁ గడుభయంబున వీక్షించు చుండుననియు మారీచుండు చెప్పెను గాని, రావణుం డతని హితవాక్యంబు లించుకయు నాలింపఁడయ్యె. రోగి కౌషధముం బోలె మారీచుని హితవాక్యంబులు రావణునకు రుచింపవయ్యె. ఎంత చెప్పినను వినక "మారీచా! నీ కిపుడు తప్పక నెఱవేర్పవలయు. నీవు బంగరు లేడి వేషంబున రాముని యాశ్రమంబుకడం జరించు చుండుము. నిన్నుం జూచినంతనే సీతాదేవి నీకొఱకు రామలక్ష్మణులం బంపును. నిన్ను రాముఁడు వెంటాడునపుడు 'హా! లక్ష్మణా! హా! సీతా!' యని యఱుపుము. ఆ వెంటనే నేనామె నెతుకొని వచ్చెద. నీ వటు చేయని యెడ నిన్నిప్పుడే చంపివైచెద" నని రావణుండు దాని బెదరించెను: "ఈ దైత్యుని చేతం జచ్చుట కన్న శ్రీరాముని చేతనే చచ్చుట మేలు. మోక్షము లభింపఁగల" దని యెంచి మారీచుండు హరిణ రూపంబున రామాశ్రమంబునకుం బోయెను. సీతాదేవి పుష్పాపచయం బొనర్పు

కంటి నా మాయలేడి యామె సమ్ముఖమ్మున నాటలాడఁ గొచ్చె. సీతాదేవి దానింగాంచి విస్మయం బంది "హరిణంబు నెట్లైనం బట్టితె"మ్మని శ్రీరామునిం గోరెను. అంతట లక్ష్మణుండు రాముని ప్రయత్నంబు గ్రహించి "అగ్రజా! స్వర్ణహరిణం బెచ్చట నైన నుండునా? ఇది తాటకా పుత్త్రుండగు మారీచుని పనియై యుండును. ఈ దుష్టుం డప్పుడప్పుడీ వేషంబునవేసి వచ్చి మునులం జంపుచుండునని చెప్పికొందు" రని యతనిని వారింపఁ బూనెను.

శ్రీరాముఁడు జానకి వాంఛం దీర్పనెంచి "లక్ష్మణా! నీ విదిగెం గాపాడు చుండుము. ఈ సారంగముం బట్టి తెచ్చెద" నని ధనుర్బాణపాణియై దాని వెంబడించె. అతఁడు సమీపింపఁ బరువిడిన నది మొక యగుచుఁ, గొంత తడవు చేరి కనుపట్టుచు, మరికొంత తడవు కను దూరం బేగునట్లును గానిపించుచుండెను. నడుమ నడుమ నదృశ్యం బగుచుండెను. ఇట్లది శ్రీరాముని వలసట పాల్సేయ "నతండిక నూరకుంచిన ఫలంబు లే"దని యెంచి తీవ్రంబగు నొక నారాచంబును సారంగంబు పైఁ బ్రయోగించె. ఆ శరంబు తిరంబుగ మేన నాఁటినంతనం సారంగంబు తన తొంటి మారీచ రూపముం గైకొని "హా! లక్ష్మణా! హా! సీతా!" యని పెద్ద యెలుంగున నఱచి క్రిందంబడి వెంటనే ప్రాణంబులు విడిచె. అంత శ్రీరాముఁడు ఆహా! యీ ధ్వని విని సీత యాతురతతో నాకడకు నా తమ్మునిం బొమ్మనును. సీత యొంటిపాటున నేమి కీడు

మూఁడునో? వేగంబ పోవలయు' నని సత్వరంబుగా తిరిగి వచ్చు
చుండె. అంతలో, సీత రాక్షస మాయారావంబును విని "నా
భర్తయే యిట్లు పిలిచియుండ నోపు. అతని కేమి యిక్కట్టు
సంభవించెనో?' యని యెంచి విచారించి ముద్దు మఱందిం
జూచి, సౌమిత్రీ! నీ యన్న యెన్నండును లేని దీనత్వంబున
నిన్నును, నన్నును జీరె. అతని కేమి యాపద సంభవించెనో?
నీవు వేగంబ చనవలయు" నని మందలించె. ఆ యఱపుఁ
రాక్షస మాయగా లక్ష్మణుం డూహించి, "అది మా యన్న
కంఠస్వరంబు కాదు. అతని కేమియుం జిక్కు తటస్థించి
యుండదు. నీ వించుకయుఁ గించ నొందకు" మని యూఱ
డింపఁ జూచెను. తా నెన్ని విధంబుల ధైర్యపెట్టిన నతండు విన
కుండుటం గాంచి "నీ యన్న ప్రాణంబులు విడిచిన నీవు సుఖం
బుగ నుండవచ్చు నని తలంచితివా? నీకింతేనియు విచారంబు
లేదా? పాపాత్ముఁడా! నీ వంటి యనుజుం డుండిన నపకీర్తి
పాలగుట వింతయా? నీ మనంబునఁ గల కోరిక నాకిప్పుడు
తెలిసినది. ఛీ! నీ మొగముం జూడరా" దని సీత యతని నిం
దించెను లక్ష్మణుం డందులకుఁ దన మనంబునఁ గటకటంబడి
తల్లీ! శ్రీరాముని ప్రభావంబు నే నెఱుంగనిది కాదు. అతని
నెవ్వరుం జంపఁ జాలరు. నిన్ను గాచుచుండు మని మా
యన్న నన్ను నియమించిన కారణమున నేను నిన్ను వదలి
పోవుట యధర్మంబు. నీవు భయంపడకుము. శ్రీరాముఁ
డిప్పుడే యేతెంచు" నని సమాధానంబు చెప్ప, ఆమె
మఱింత పరుషంబుగ నతని నిందించె. లక్ష్మణుఁడు క్రుద్ధుం

డై "అమ్మా! నేను నిన్ను నా తల్లిం బోలె ప్రేమించు చున్నాఁడ. నాయెడ నీ కిపు డెప్పు డుండెడు భావము లేదు. నే డేమో విపరీత వాక్యంబులు నీ నోట వెల్వడుచున్నవి. శివశివా! నీ వచనంబులు వినరాదు. ఇప్పుడే శ్రీరామాన్వేష ణార్థం బరిగెద" నని బయలుదేరి "అహా! సీతాదేవి నోటికి విడిచి యగ్రజుని వాక్యంబులకు విరుద్ధంబుగ నే నేగుచున్నాఁడ. ఎట్టి యిక్కట్టు సంభవించ నున్నదో?' యని విచారించుచుం బోయెను. సమయంబు వేచియున్న లంకేశ్వరుండు సన్యాసి వేషంబు దాల్చి పర్ణ కుటీర ద్వారమునకుం జని సీతతోఁ గపట సంభాషణంబు సలుపం దొడంగె. ఆమె యతండు నిజంబుగ బ్రాహ్మణ సన్యాసియే యనుకొనెంగాని మాయావి యనియుం దన్ను వంచింప నేతెంచె ననియుం దలంప దయ్యె. యోగికి వందనంబు లర్పించి, శ్రీరామ లక్ష్మణులు వచ్చునంతవఱకు నచ్చటనే యుండుం డని కూర్చుండుటకొఱకు కుశాసనం బొసంగి తినుండని కొన్ని ఫలంబు లొసంగి సీత వానికిం దగిన సత్కారంబు లొనరించెను.

అంతట, రావణుండు సీతాదేవిం గాంచి "రాజ్య భ్రష్టుఁ డగు రామునితో నీ యరణ్యంబున నెందుల కిక్కట్ల పాలయ్యెదవు? లంకాపురాధీశ్వరుండనగు నన్నుంగూడి యానం దింపుము. నాతో ర"మ్మని నిజాభిలాషం బెఱింగించెను. అంత జానకి భయాతిరేకంబున నిశ్చేష్టయై కొంతవడికిం దెప్పఱిల్లి "ఓరీ! పాపీ! నే నొంటిగ నున్నప్పు డేల యిట్లు ప్రేలెదవు? ఆఁగు మాఁగుము! శ్రీరాముఁ డనుజ సమేతుండై వచ్చి

నిన్నుం దునుమాడు" ననియె. వెంటనే దైత్య వల్లభుండు పది శిరంబులు నిరువది కరంబులుఁ గల తన భీకరాకారముం జూప సీత భయం బంది మూర్ఛిల్లెను. అతండామె నెత్తుకొని రథంబునం బెట్టుకొని లంకకుం బయన మయ్యె. భూజాత కొంత సేపటికిఁ జైతన్యం బంది మిక్కుటంబుగ దుఃఖించుచు నా క్రూరాత్ముని హస్తములనుండి తప్పించుకొనఁ జూచెం గాని యయ్యది సాధ్యము కాకపోయెను. తుదకు సీత గత్యంతరంబు గానక "ఓ సురలారా! మునులారా! ధరణీ దేవులారా! ధన్యాత్ములారా! నన్నీ రావణుండు బలవంత ముగఁ గొనిపోవుచున్న యుదంతము శ్రీరామున కెఱింగించి నన్ను రక్షింపుఁ" డని యాక్రందింపఁ దొడంగె. ఆ యార్త నాదంబు విని నిద్రించుచున్న జటాయువు లేచి రావణుండు సీత నెత్తుకొని పోవుచుండుటం దెలిసికొని వానితో యుద్ధంబు సేయఁ గడంగె. ఆ ఘోరం బగు యుద్ధంబున జటాయువు రావణుని రథంబును, సారథిని, ఛత్రంబు మొదలగువానిని ధ్వంసముచేసె. రావణునితో నెంత తడవు యుద్ధంబు చేసినను బ్రయోజనంబు లేకపోయె. ఒక చేత ఖడ్గంబు నొక చేత సీతాదేవి నెత్తుకొని రావణుఁడు పాఱిపోవఁజొచ్చె. జటాయువు మరల యుద్ధంబునకు సన్నద్ధుం డయ్యెం గాని గెలువఁజాలం డయ్యె. ఎన్నిసారులు తలలు నఱికినను మరల నవి మొలక లెత్తుచుండుటవలన నతని శ్రమంబు ఫలింపకపోయె. సీత హతాశ యయ్యె. అట్టియెడ నామె దుఃఖించిన దుఃఖమునకు మేరయుండునా? ఎవ్వరికిఁ జెప్పుకొనును? అయ్యది సిగ్గున

ప్రదేశంబు. అట్లాకసంబుమీఁదుగ రావణుండు తన్నుం గొని పోవుచుండ, నొక పర్వతంబున నయిదు వానరంబు లుండుటం జూచి తన పయంట కొంగు సంజించి దానిలోఁ దన యాభరణంబులం గట్టి యా మూటను వాని సమీపంబునం బడవైచె.

శ్రీరాముఁడు మారీచుం జంపి వచ్చుచు లక్ష్మణునిం జూచి "ఏమి లక్ష్మణా! సీతను వదలి యిట్లు వచ్చుచున్నావు? ఆమె కేమయిన నాపద సంభవించు నేమో!" యనుచు భయభ్రాంతుండై త్వరితంబుగఁ బర్ణశాలకు వచ్చిచూడ సీత కాన్పింపదయ్యె. "అహో! సీత యెందుఁబోయె? ఎక్కడనైన డాఁగెనా? స్నానార్థంబు పుష్కరంబునకుం బోయెనా?" యని శంకించుచుఁ బర్వతంబులందును, నదీతీరములందును, వృక్షగుల్మలతాదు లందును రామలక్ష్మణు లామెను వెదక నారంభించిరి. ఆమె యెచ్చటం గాన్పించదయ్యె. అంత, రాముఁడు మిగుల దుఃఖితుఁడై "తరులారా! హరులారా! కరులారా! నా తరలాక్షిం గంటిరే? పూర్ణచంద్రవదనా! కోమలాంగీ! నాపైఁగోపమా? పలుక వేట?" కని యున్మాదం బతిశయిల్లఁ బెక్కుభంగుల విలపింప సాగెను.

అట్లు విలపించుచు రాముఁడు సీతాన్వేషణంబు సేయుచుండ జటాయువు గనపడెను. రామలక్ష్మణులు గుర్తింపలేక "యీ పక్షియే సీతను జంపి యుండు" నని దానిం జంప నుంకించిరి. "నేను జటాయువను; దశవదనుండు జనకజం గొన్నిపోవుచుండ వాని రథంబు భగ్నంబు సేసితి. రావణుండు

నన్నస్త్రమునం గొట్టుటచే ఱెక్కలు ముక్కలయినవి. రామా! ఇంక నాకు నీవే శరణంబ' వని యా పక్షిం ద్రుండు ప్రాణంబులు విడిచె. అంతట, శ్రీరామచంద్రుం కాష్ఠంబులచేఁ జితిం బేర్చి యా పులుంగున కతిశ్రద్ధతో దహన కర్మం బొనరించె. రామున కపుడు దశరథుని మరణ వార్త వినినప్పటి దుఃఖంబు సంప్రాప్తమయ్యె. దహన క్రియా నంతరంబు వా రరణ్యమధ్యంబునఁ బోవుచుండ వికృతా కారుం డగు నొక దైత్యుండు వారికిఁ గాన్పించె. వానికిఁ దలయుం, గన్నులును నడిమి భాగంబున నుండె. వాని బాహువులు శతయోజన దీర్ఘంబులు. వాని పేరు కబంధుండు వాఁడా కరంబులతో రామలక్ష్మణులం బట్టుకొని తన యుదర మధ్యమున నున్న దంతంబులతో నమలి తినంబోవ రామ లక్ష్మణులు వాని హస్తంబులను ఖండించిరి.

అపు డా రాక్షసుండు వారిని రామలక్ష్మణులుగా గ్రహించి తన్ను దహింపుఁ డని యభ్యర్థించి వారిచే దహింపఁబడి దివ్యసుందర రూపము దాల్చి రామునితో నిట్లనియె. "అయ్యా! నేను గంధర్వుండను. ఒకానొక దినం బున రాక్షస రూపంబు దాల్చి స్థూలశిర మునిని భయపెట్టఁ బోవ న 'న్నట్లె యుండు' మని యతండు శపించెను. నేనతనిం బరిపరి విధంబుల 'నా తప్పు మన్నింపు' మని వేఁడితి. 'శ్రీరాముఁడు వచ్చి యుద్ధవంబున నిన్నెన్నండు దహనంబు సేయునో నాఁడ నీకుఁ దొల్లింటి గంధర్వ రూపంబు రాఁగల'

దని యనుగ్రహించె. రాక్షసత్వంబున నే నింద్రునితోఁ బోరాడితి. అతండు ప్రయోగించిన బాణంబువలన నా తల యుదరంబులోనికిం దూరిపోయెను. అప్పుడు నేను మహేంద్రుం బ్రార్థింప నతండు దీర్ఘబాహువుల నిచ్చె. నేనప్పటి నుండియు నిట్లే యున్నవాఁడ. నేఁటికి మీ యనుగ్రహంబు వలన శాపవిముక్తిఁ గాంచి ధన్యుండ నైతిని. మీరు బలశాలి యగు సుగ్రీవుని దగ్గఱ కేగిన నతండు మీకు సహాయుండగు" నని చెప్పి యా గంధర్వుండు స్వర్గంబునకుం బోయెను. రామలక్ష్మణులు నట్లే సుగ్రీవుని కడకుం బోవుచుండ వారికి వృద్ధతపస్విని యగు శబరి కాన్పించె. ఆమె శ్రీరామచంద్రుని నిమిత్త మెదురుచూచుచుండె. అతనికొఱకు సేకరించి యుంచిన వివిధ ఫలంబుల నతని కొసంగి యతని నాదరించి యాతనివలన సదుపదేశంబుం బడసి కాష్ఠంబులం జితిఁ బేర్చి కొని శబరి దివంబున కరిగె.



శ్రీ ర స్తు.

# సీ తా రా మ ము

## నాల్గవ ప్రకరణము.



పంపానదిం దాఁటి ఋశ్యమూకముం జేరి, యాపర్వత ప్రాంతంబున వానర రాజగు సుగ్రీవుండు తన యనుచరులం గూడి సరససల్లాపంబు లాడుచుండ రామలక్ష్మణులు వారిం జూచిరి. సుగ్రీవుఁడు రామలక్ష్మణులం గాంచి, రాజ్యభ్రష్టునిఁ జేసియుం దనియక వాలి తన్నుఁ జంపం బ్రయత్నించుచున్నాఁడేమో యని యనుమానించి భయంపడెను. వారిలో హనుమంతుం డను వీర పురుషుండు గలండు. "సుగ్రీవా! వారు ఋశ్యమూకంబునకై వచ్చినవారు కారు. అట్టి లక్షణంబు లెవ్వియు వారి యిరువురియందుం గాన్పింప" నని యతండు ధైర్యంబు చెప్పె. అంతట సుగ్రీవుండు "హనుమంతా! వారిరువురును వాలి సంబంధులవలెనే యున్నారు. వా రెవ్వరో విచారించి రమ్మని" యతని నంపె. హనుమంతుండు పేద బ్రహ్మచారి వేషంబు వైచికొని శ్రీరాముని చెంతకుం జని మధుర వాక్యంబులతో "మహాశయులారా! మీరెచ్చటినుండి యెచ్చటి కేగుచు నిచ్చటికి విచ్చేసితిరి? మీరు సామాన్యులవలెం గాన్పింపరు. కందర్ప సుందరాకారులును, గమలాప్త తేజులు నైన మీ రేతెంచిన కారణంబేమో యెఱింగింపుఁడు. సుగ్రీవుండు తన యన్న యగు వాలిచే

రాజ్యభ్రష్టుండై యీ ఋశ్యమూక పర్వతంబున నివసించు
చున్నాఁడు. సుగ్రీవుఁడు చాల ధర్మాత్ముండును, సాహస
వంతుండును. అతండు మీ మైత్రికై కుతూహల పడు
చున్నవాఁడు. అందులకే నన్ను మీ కడ కతం డంపె. నే
నతని మంత్రిని; హనుమంతుఁ డనువాఁడ" నని విన్నవించె.
అతని వాక్యంబు లాలించి, శ్రీరాముఁడు తమ్మునిం గనుం
గొని "మనము సుగ్రీవుని కొఱకే వెదకు చున్నారము.
ఇంతలో నతని మంత్రియే వచ్చెను. ఇతండు చూడఁ గనుం
గడు బుద్ధిమంతుఁడుగను, విద్యావంతుఁడుగను గాన్పించు
చున్నాఁడు. లక్ష్మణా! నీ వితనితో నత్యంత నిపుణంబుగా
మాటలాడి సమాచారం బంతయుం గనుంగొను" మని
యానతిచ్చె లక్ష్మణుండు హనుమంతుని వంకకుం దిరిగి
"హనుమంతా! మేము దశరథ తనయులము; రామ లక్ష్మణు
లను వారము. ఆమ్మహారాజు ప్రియభార్య కైకవలన మేము
రాజ్యభ్రష్టులమై యడవులం జొచ్చితిమి. అనేక రాక్షసులం
జంపితిమి. సీతాదేవిని మాయాకురంగంబై వంచించిన మారీ
చుని పీఁచ మణఁచితిమి. ఇపుడు సీతం గోల్పోయి యామె
నివ్వనంబున వెదక నరుదెంచితిమి. ఆమె యెచ్చట నున్నదో
యెఱుంగుదువేని దయచేసి చెప్పుము. శ్రీరాముఁడు సుగ్రీ
వునితోడి మైత్రి నభిలషించుచున్నాఁ" డని యతనిం
బ్రోత్సాహపఱచెను. "మీ రాయనతో స్నేహంబు చేసిన
సీతను వెదకు సందర్భమున మీ కతఁడు సహకారి కాఁ
గలండు. అతండె యిందుల కొంతయు సమర్థుండు; ఇపుడు

వాలి భయమ్మువలన నివురు గవిసిన నిప్పువలె నున్నవాఁడు. మీవలన నతనికిం గూడ నుపకృతి కలుగవచ్చు" నని ప్రత్యుత్తరం బిచ్చి, యాంజనేయుఁడు రామలక్ష్మణులం దన భుజంబుల నిడుకొని వాయువేగంబున సుగ్రీవుని కడకుం జనియె. సుగ్రీవుండు శ్రీరామునకుం గృతపరిచయుండై "మహానుభావా! నీవి జగంబం దందఱికన్న శ్రేష్ఠుండవు. నేను సామాన్య వానరుఁడను. నీవు నాతో స్నేహం బొనరింప నిచ్చగించుచున్నందులకు నా కపరిమితానందంబు పొడముచున్నది. నేనెంతటి యదృష్టవంతుండ!" నని తన మనోగతంబు వ్యక్తీకరించె. అంతట వాయునందనుం డగ్నిం బ్రజ్వలింపఁజేయ, సుగ్రీవుం డగ్నిసాక్షికంబుగ రామునిం గని "నీవు నా ప్రాణమిత్రుండవైతివి నీ సుఖమే నా సుఖము; నీ దుఃఖమే నా దుఃఖము; నీ యిష్టమే నా యిష్ట"మని ప్రమాణంబుసేసి "మింటిదారిం దన్నవఁడో కొనిపోవుచుండ, నొక రమణీమణి యేడ్చుచు నొక భూషణంబుల మూట నిటం బడ మీటె. ఇదియే యామూట. దీనిం జూడు"మని దాని ⋅ తని కందిచ్చె. శ్రీరాముఁడా యాభరణంబుల గాంచి "హా! ప్రియా!" యని యేడ్వం దొడంగెను. "జగ మంతయుం గాలించి జానకిం దెత్తును, నీవు వగవకుము; సీతాదేవి యెచ్చట నున్నం దెచ్చి నీ కిచ్చెడి భారంబు నాయది" యని సుగ్రీవుండు రాముని కుత్సాహంబు కలిగించె. అంతట శ్రీరాముఁడు "వాలిని వధించి నీచేఁ గపిరాజ్యం బేలింతు" నని శపథంబు చేసి సుగ్రీవు నోదార్చె. అనంతరము సుగ్రీవుఁడు శ్రీరాముని పాదంబులకు మ్రొక్కి

తన యుదంతం బిట్లు వచింపఁజొచ్చె; "అయ్యా! మాయావి
యను నొక ఘోర రాక్షసుం డొకప్పుడు వాలితో యుద్ధంబు
చేసెను; వాఁడు దుందుభికి సోదర పుత్త్రుండు. తుదకు వాఁడు
వాలితోఁ బోరాడలేక యొక పర్వత గుహం జొచ్చెను; వానిని
వెంబడించిన వాలియు నా బిలంబుం బ్రవేశించి నన్నా
గుహాముఖంబున నుండ నియమించెను. అప్పుట నే నొక
సంవత్సరంబు వఱకు వేచియుంటిని. వాలి గుహాముఖంబు
నకు మరలి రాకుండుట చేతను, గుహనుండి యుష్ణరక్తంబు
బహిర్గతం బగుటవలనను, రాక్షసుల భీషణారావంబులు వినం
బడుటవలనను వాలి మృతి నొందె నని నిశ్చయించుకొని బిల
ముఖంబున నొక శిల నడ్డువెచి సోదరుం గూర్చి దుఃఖిం
చుచుఁ గిష్కింధకుం బోయితి. పురవాసు లందఱు వాలి
మరణవార్త నాలించి నన్నుం బట్టభద్రుని నొనర్చిరి. కొంత
కాలంబునకు వాలి మరలివచ్చి "నే నీ సుగ్రీవుని గుహాము
ఖంబున నుంచి రాత్రించర సంహారంబునకై గుహం జొచ్చితి.
మరల వచ్చునంతలో నీ దుష్టుండు గుహాద్వారంబును శిలచేఁ
గప్పి నా రాజ్యం బాక్రమించుకొని యేలుచున్నాఁ"డని
పౌరులకుం జెప్పి నన్నుఁ బలుబాములం బెట్టి వెడలఁ గొట్టెను.
నే నెన్ని విధంబుల సత్యముం జెప్పినను నా వాక్యంబు లతఁ
డాలింపఁడాయె. అప్పటినుండియు నేను వాలి భయంబున
నీ ఋశ్యమూక పర్వతంబున వసించుచున్నాఁడ. మతంగ
మహాముని శాపంబున వాలి ఋశ్యమూక పర్వతంబునకు
రాఁజాలఁడు. కావున, నే నిక్కడ నిర్భయంబుగా నుండఁ

గల్గితి" నని సుగ్రీవుండు తన కష్టకారణముం జెప్పి శ్రీరాముఁడు వాలిని సంహరించెద నని నందులకుఁ జాల సంతోషించెను. గాని "దుందుభి సంహారుం డగు వాలిని శ్రీరాముఁడు చంపఁగలఁడో లేఁడో?" యని సందేహింపఁ జొచ్చెను.

దుందుభి భీకర మహిషాకారుఁడు. ఆ రాక్షసుండు సముద్రునితో యుద్ధము సేయం బోయె. సముద్రుఁడు భీతిల్లి నమస్కారపూర్వకంబుగం దన యశక్తత నొప్పుకొని హిమవంతుని కడకుం బొమ్మనియె. హిమవంతుండును యుద్ధంబునకు సమ్మతింపక కిష్కింధా పురాధీశ్వరుం డగు వాలియొద్దకుం బొమ్మనియె. అంత దుందుభి వాలియొద్దకు వచ్చి "నాతో యుద్ధంబు సేయు" మని కోరె. వాలి వానిం జంపి దర్దిరం ద్రిప్పి నాలుగు క్రోశముల దూరంబునం బడవైచె; దుందుభి రక్తంబు మతంగ మున్యాశ్రమంబునం బడుటం జేసి యమ్ముని యాగ్రహించి "వాలి యచ్చటికి వచ్చిన శిరస్సు బ్రద్దలయి చచ్చుఁగాక!" యని శపించెను. వాలి బలంబున కద్భుతపడి భయంపడుచుండెడి సుగ్రీవుం డచ్చటనే పడియున్న దుందుభి యెముకలు శ్రీరామునకుం జూపె. అతని సందేహము న్నివారింపఁ దలంచి "ఓసుగ్రీవా! శ్రీరాముఁ డేమి జేసిన నతండు వాలిం జంపఁగలం డని దృఢమ్ముగ విశ్వసించెద"! నని లక్ష్మణుండు ప్రశ్నించె. "దుందుభి శల్యపంజరంబును ద్విశతధనుర్దూరం బెగురవైచినను సప్తతాళంబుల ధనుస్సుని భేదించినను నాకు నమ్మకంబు జనించు" నని యతఁడు ప్రత్యుత్తరఁబిచ్చె. శ్రీరాముఁడతండు

కోరిన రీతి నతనికి విశ్వాసంబు కలిగించె. అంత; సుగ్రీవుండ "వాలిని శ్రీరాముఁ డొక్క బాణంబుననే చంపఁగలఁడ" ని గ్రహించి వాలి మందిరంబుకడ కేగి యాకసంబు బ్రదలఁగ నట్లు "అన్నా! ఎందున్నాఁడవు? రా రమ్ము; కొంచెము యుద్ధంబు సేయుద" మని యఱచెను. వాలి యా కంఠధ్వని వినినతోడనే రోషపరవశుండై సుగ్రీవుని పయింబడి ఘోరంబుగఁ బోరొనర్చెను. తుదకు సుగ్రీవుం డోటువడి పర్వతంబునకుం బరువిడి వచ్చి "హా! మిత్రమా! ఇది యేనా నీ వొనర్చెడి సహాయంబు? నేను మృతప్రాయుండనై యుండ నీవు వినోదంబు చూచుచుంటివా?" యని రామునిం దెప్పెను. శ్రీరాముఁడు సుగ్రీవుం గాంచి "నెచ్చెలీ! ఆగ్రహింపకుము. నేనందుచే బాణంబు విడువలేదో వినుము; మీ యిరువురి యాకృతులు నొక్క తెఱంగుననె యుండుటంబట్టి యెవండు వాలియో కనుంగొన నేరనైతి. వాలిం జంపఁబోయి నిన్నుం జంపిన లోకులు నన్ను నిందింపరా? నీ వేదేని యొక చిహ్నంబు ధరించి యుద్ధమునకుం బొమ్ము. అప్పుడు వాలి నొక్క కోలం దూలింతు" నని నచ్చఁజెప్పి లక్ష్మణునిం గాంచి "తమ్ముడా! ఏదే నొక పుష్పలతను సుగ్రీవుని కంఠమందుంచు" మని యాజ్ఞాపించెను. లక్ష్మణుం డటు వర్తించెను. అప్పుడు సుగ్రీవుం డెక్కుడు ధైర్య సాహసములతో మరల నరిగి వాలిని యుద్ధమునకు రమ్మని భయంకరనినాదంబుఁ గావించె. సుగ్రీవుని యుత్సాహంబు చూచి వాలి సత్వరంబుగ యుద్ధసన్నద్ధుం డయ్యె. ఇరువురును సమాన ధైర్య

శౌర్యంబులతోఁ బోరాడిరి. కాని వాలి కెక్కుడు బలముండుట వలన సుగ్రీవుండు వెనుకంజ వేయవలసి వచ్చెను. ఈ సమయంబున శ్రీరాముఁడు వాలి వక్షస్థలంబు వ్రయ్యునట్టు లొక బాణము వైచెను. బాణఘాతము వెంటనే వాలి నేలం గూలెను. రామలక్ష్మణులు వానిం జూడఁ బోయిరి. "నీ వెట్టి శూరుండవు! దొంగతనంబుగ నామీఁద బాణంబు వైచితివి; నా యెదుట నిలిచి పోరాడినం గదా! నీ పౌరుషంబు బయల్పడెడిది? నన్నుఁ జంపుటచే నీ కేమి లాభంబు గలిగినది?" యని వాలి శ్రీరాముని నిందించెను. "నీవు దుష్టుండవు. కావున శిక్షార్హుండ" వని శ్రీరాముఁడు ప్రత్యుత్తరం బిచ్చె.

శత్రుసంహారము సంతోషకారణం బైనను వాలి భార్య తారయు, కుమారుం డంగదుండు వాక్రందించునపుడు, రామలక్ష్మణుల మాట యటుండనిండు. సుగ్రీవుఁడు సైత మశ్రుధార లాఁపంజాలకపోయె. మృత్యువు ప్రాపింపక మున్న వాలి మంచి బుద్ధి తెచ్చుకొని సుగ్రీవునిం బిలిచి "సోదరా! దుర్బుద్ధిచే నేను నీయెడ నన్యాయం బొనరించితి; నన్ను క్షమింపుము; అంగదుని నీకే యొప్పగించుచున్నాఁడ. నీ పుత్త్రుం బోలె వానిం జూచుకొ"మ్మని తన కంఠహారముం దీసి సుగ్రీవున కొసంగెను. వాలి మృతి నొందిన వెంటనే సుగ్రీవుని రాజుగను, అంగదకుమారుని యువరాజుగను శ్రీరాముఁడు నిర్ణయించె. పిమ్మట సుగ్రీవుండు సుఖంబుగఁ గాలము గడుపుచు సీతాన్వేషణ విషయమే విస్మరించెను. సుగ్రీవుండు సంసార సౌఖ్యంబులలో మునింగి తమ్ము మఱచియుండుట నెఱింగి

శ్రీరాముం డతనిం గొని రమ్మని లక్ష్మణుం బంపె. ఇనజుండు లక్ష్మణుని సకల విధంబుల సత్కరించి యనుచర సమేతంబుగా శ్రీరాముని కడ కేతెంచె. పృథ్వియీనినట్లు వివిధ ప్రదేశముల నుండి వానరులు కిష్కింధా పురంబునకు వచ్చిరి. గణనాతీతం బగు వానర బలంబునకుం దావు చాలదయ్యె. విశాలం బగు కిష్కింధా పట్టణంబు చిన్నదిగం గాన్పించె. సుగ్రీవుం డా వానరు లన్నలు దిక్కులకు భూసుతాన్వేషణార్థం బంపెను. వారందఱిలో వాయుసుతుం డగు నాంజనేయుండు కడుంగడు బలవంతుండు. సుగ్రీవుం డతనిం బిలిచి "హనుమంతా! జల స్థల గగన స్వర్గంబులందు నీవు దక్క మఱియెవ్వరుం దిరుగం జాలరు. కావున సీతాన్వేషణంబు మిక్కిలి జగరూకతతో నీవ కావింపవలయు. నీ వంటి వీర పురుషుండు గానరాడు. తప్పక నీ వీ కార్యము సాధింప జూనుకో" మ్మని హెచ్చరించెను. ఆంజనేయుండు జనకజం జక్కంగ వెదకి తేఁగలండని గ్రహించి శ్రీరాముం డతనికిం దన యుంగరం బిచ్చి యది సీత కానవాలుగం జూపు మని యానతిచ్చె. సీత నెటులైనం దోడ్కొని వచ్చుట కత్యుత్సాహంబుతో బైలుదేరి నానా దేశంబులుం దిరిగి యెంత శ్రమపడి వెతకినను ధరణిజ యన్వేషకుల కెవరికిం గాన్పింపదయ్యె. ఇట్లు వారు మాస పర్యంతముం బర్యటనంబు సేసి మగిడి కిష్కింధా పురంబు చేరిరి. హనుమంతుండు, అంగదుండు, జాంబవంతుఁడు మున్నగు వానరులు దక్షిణ దిక్కునకుం బోయిరి. వారుమాత్ర మింకను మరలిరాలేదు. వారుం దిరిగిదిరిగి వేసరిరి. కాని, శ్రీరాముని

యెడ నాంజనేయుని కెక్కుడు భక్తి యుండుటవలన నతండు వారిం బ్రోత్సాహపఱచి మరల సీతాన్వేషణంబునకుం బురికొల్పెను.

కపిసేన సంచారము చేసిన ప్రదేశం బంతయు భస్మీభూతం బయ్యెను. వృక్షములు జన్మించుటకేని వీలు లేకుండెను. సరోవరంబు లన్నియు నెండిపోయెను. ఘోరారణ్యము నిశ్శబ్ద మయ్యెను. వా రప్పుడు సంచరించుచున్న స్థలము మిక్కిలి భయంకరము. పూర్వ మయ్యెడఁ గండునామంబు గల యొక ముని యుండెడివాఁడు. తన పుత్త్రుండా ప్రదేశమున మృతి నొందుటచే నమ్ముని దుఃఖంబున మునింగి యావనంబును దగ్ధంబుగా శపించె. అచ్చటం గూడ సీత కాన్పింపకపోయె. వారంతట మఱియొక వనంబు ప్రవేశించిరి. అచ్చట వికృతాకారుం డగు నొక రాక్షసుండు వారిం జంపుటకుఁ దఱుముకొని వచ్చెం గాని యంగదుండు వానిని నేలం గూలఁజేసె. హనుమదాదులు భూతనయ నన్వేషించుచుం దిరిగి తిరిగి యొక గుహాముఖంబున కేతెంచిరి. గుహనుండి హంససారసాది పక్షిగణంబు జలకణాలంకృతంబై వచ్చుచుండుటం బట్టి తదంతరంబున జలాశయం బుండు నని తలంచి యం దందఱుం బ్రవేశించిరి.

వా రటు పోవం బోవఁ గొంత దూరం బంధకారబంధురంబుగ నుండెను. ఆ చీఁకటిం దాఁటిన వెనుక దివ్యజ్యోతి కాన్పించె. అక్కడి వృక్షంబులు, సరస్సులు, మత్స్యంబులు

సర్వంబు స్వర్ణమయంబై యుండె. అయ్యెడ నొక తపస్విని నిజప్రభావంబువలన దేహమునుండి యగ్నిజ్వాలలు ప్రజ్వ లించుచున్నట్లు ప్రకాశించుచుండె. ఆమె విశ్వకర్మ పుత్త్రిక యగు హేమ. కపివీరు లంతఱు నామె కతిభక్తితో నమస్క రించి "అమ్మా! మే మన్నపానంబులు లేక కృశించియున్న వారము. ఈయద్భుతం బెవ్వరిదో, ఈ వస్తువులన్నియు నెట్లు హేమమయంబు లయ్యెనో కరుణించి యెఱింగింపు" మని ప్రార్థించిరి.

తపస్విని వారింజూచి "వత్సలారా! ఇది మయరాక్షస వినిర్మితంబు. మీ రీ భయంకర స్థలంబున కెందుల కేతెంచితి?" రని వారికి నానావిధ ఫలంబుల శీతలోదకంబుల నొసంగె. వానరవీరులు వాని నానందంబుగం బరిగ్రహించి యామె కనేక వందనంబు లర్పించి యా బిలంబునం దొక మాసంబు గడపిరి. తరువాత వారు బయల్పడ మార్గంబు గానక మహా విపత్సనం బడియుండ "వత్సలారా! ఈ గుహాయం దొకసారి ప్రవేశించినవారు మఱల వెడలుటకు వీలు లేదు. ఐనను మీరు భయపడకుండు. క్షణమాత్ర నేత్రంబులు ముకుళించు కొందు రేని మిమ్ము బయటికిం దీసికొనిపోయెద" నని హేమ వారి సంకటమును దీర్చె. వారు నేత్రంబులు మూసికొని తెఱచునంతనే వింధ్యపర్వత ప్రాంతంబున నుండిరి. సమీపం బున సముద్రిందు తరంగ ముఖంబున గర్జించుచుండె. బయటి వచ్చిరే కాని వారి కించుకయు నానందంబు లేదు. సీతం

గనుంగొని పోకున్న సుగ్రీవుండు తమ్ముం జంపు నని వారు భయంపడం జొచ్చిరి.

వారు రిక్తహస్తంబులతో స్వదేశంబునకు మరలుట కన్న నన్నపానంబులు విసర్జించి యచ్చటం జచ్చుటయే మంచిదని నిశ్చయించుకొని విచారగ్రస్తులై శ్రీరామచంద్రుని, సీతాదేవిని, దశరథుని, జటాయువును బేర్కొనుచు నేమేమో ప్రస్తావించుకొనుచుండిరి. వింధ్యపర్వత శిఖరంబునం గూర్చున్న ఖగేంద్రుం డొకండు వనచరులం జూచి “చాల దినంబులకు నాకు మంచి యాహారంబు లభించినది. ఏమి నా భాగ్యంబు! ఒక్కొకదానిం జంపి తినెద” ననుకొని యువ్విళ్ళూరం జొచ్చెను. ఆ మాటలు విని యంగదుండు హనుమంతునిం జూచి “యముండు మనలం దీసికొనిపోవుటకుం బక్షిరూపంబున వచ్చె. మన ప్రాణంబులు పోయినను మనము సీతను గనుంగొనకుండం బోరాదు. జటాయువు సీతాదేవికొఱకు యుద్ధముం జేసి ప్రాణ మర్పింపలేదా!” యని హెచ్చరించెను. జటాయువు పేరు విని నంతనే యా ఖగేంద్రుం డాతురతం జెది “మీర లెవరు? నాసహోదరుండగు జటాయువు మృత్యువు వాతం బడినట్లు నుడువుచున్నారు. వాఁ డెట్లు చనిపోయినాఁడు? నేను సంపాతిని. నా రెక్కలు కాలిపోయినవి. నేనెగురంజాలను. నన్ను మీకడకుం దీసికొనిపొం” డని వారిం బ్రార్థించె. వానరులు సంపాతిని జంపుటకు భయంపడిరి కాని, తామెట్టులైనం జచ్చుటకే నిశ్చ

యుంచుకొని యున్నవా రగుటచే నంగదుండు సాహసించి సంపాతిని దించి తీసుకొనిపోయి శ్రీరాముని వనవాసము, రావణుండు సీత నెత్తుకొనిపోవుట, జటాయువు యుద్ధంబు సేసి మడియుట, శ్రీరాముఁడు వాలిం జంపుట మున్నగు విషయంబుల నన్నింటిని దెలియఁబలికె. సంపాతి యశ్రుకణంబులు రాల్చుచు "నాదు సహోదరుం డగు జటాయువుం జంపిన రావణునకుఁ బ్రతిక్రియ ఘటింపఁజాల. బాల్యంబున నేనును, నా సహోదరుండును మహేంద్రుని జయించుటకై పోతిమి. యుద్ధమునుండి తిరిగివచ్చు సమయంబున జటాయువు సూర్య తాపంబున తాళఁగలేక సొమ్మసిల్లె. అంత నతని సంరక్షింప నా ఱెక్కలం బొదివి కట్టుటచే నా పక్షంబులు కాలి నే నీ తావునం గూలితి. అప్పటినుండి యిచ్చటనే యున్నాఁడ. ఒక దినంబున రావణుం డొక యబల నెత్తుకొని పోవుచుండ నేనుం జూచితి. ఆమె "హా రామా! హా లక్ష్మణా!" యని రోదనం బొనర్చుచుండె శత యోజనంబుల వెడల్పుగల యీసముద్రముం దాఁటిన లంక కాన్పించును. అదియే దశకంఠుని నివాసస్థలంబు. మీ రాలస్యంబు సేయక శీఘ్రముగ లంక కేగుఁడు. సీతాదేవిని రావణుం డెత్తుకొనిపోవు నను సమాచారంబును నిశాకర ముని నా కిదివఱకే తెలిపి యున్నాఁడు. ఎనిమిది వేల యేండ్లక్రిందట నతం డిచ్చో నుండెడివాఁడు. నేను బ్రతిదినంబు నతనికిం బ్రణామంబు సేయుటకుఁ బోవుచుండెడివాఁడ. అతండు నాయం దత్యంత ప్రేమంబును జూపువాఁడు. నా ఱెక్కలు సూర్య కిరణంబుల వేడిమి

వలన భస్మం బయినవుడు "శ్రీరాముని దేవి యగు జానకిని రావణుం డెత్తుకొనిపోయినట్లు నీకుం దెలిసినప్పుడు మరల నీకుం జక్కని రెక్కలు వచ్చు" నని యతండు నాకు వరం బొసంగియున్నాఁ డని చెప్పుచుండఁగనే సంపాతికి సొంపుగాఁ బక్షంబు లుత్పన్నమయ్యె.

అంతట "నీ గంభీరం బగు సముద్రంబుం దాఁటి సీతా దేవి వృత్తాంతముం దెలిసికొని రాఁ గలవా రెవ్వ?" రను విష యంబు ప్రస్తావనకు రా, వానరు లందఱు "నేన చేయ నోపుదు. నేన చేయ నోపుదు" నని పంతంబు లాడసాగిరి; తుదకు హనుమంతుండే యీ ఘనకార్యంబు సాధింపఁగలవాఁ డని నిశ్చయించిరి.

హనుమంతుండు పవన పుత్త్రుండు; ఇంద్రుండు హను మంతునిపై వజ్రముఁ బ్రయోగింపఁ బ్రభంజనుం డాగ్రహ పరవశుండై సకల వాయువ్రలను బంధించె. అందువలన జను లందఱు నుచ్ఛ్వాస నిశ్వాసంబు లాడక మృతప్రాయులైరి. దేవత లందఱు నతనిం బతిమాలి "హనుమంతుండు తన కిష్టంబు లేకుండ మృతుండు కానేరఁ డనియు, నే బాణంబు వలనం జావం" డనియు వరం బొసంగిరి.

అనంతరము హనుమదాదులు మహేంద్ర పర్వతంబు నకుం బోయిరి. అక్కడ నున్న మృగంబు లన్నియు వారి రాకకు భయం బంది గుహలం బ్రవేశించె. పక్షిగణంబు లెగుర నారంభించెను.

శ్రీరస్తు.

# సీతారామము

## అయిదవ ప్రకరణము.



మహేంద్ర పర్వతముపై నొక సమస్థలంబున నిలువంబడి హనుమంతుండు దేవతారాధనం బొనరించి కరద్వయంబు మోడి కట్టి యెగురుటకు సంసిద్ధుఁడై యుండెను. అప్పు డమ్మారుతి శరీరంబు భీషణాకృతిం దాల్చినందున మహేంద్ర పర్వతంబు దాని భరింపజాల దయ్యె. ఆపర్వతంబునుండి జలంబు బహిర్గతం బయ్యె. అక్కడి మృగకులంబు ప్రళయం బాసన్న మయ్యె ననుకొనియె. మును లందఱు పర్వతంబు విడిచి దూరముగం జని చిత్రముం గనం జొచ్చిరి.

పవనసుతుం డాపర్వతమునుండి యెగురంగనే వృక్షంబు లన్నియు నతని వెనువెంటనే యెగురం దొడంగె. సముద్ర జలంబాకాశంబు నంటె. దేవత లందఱు నాశ్చర్య పడం దొడంగిరి. అతని వాయుగమనం బాకాశమధ్యమునుండి పర్వతంబు పరుగెత్తుచున్నదో యనునట్లుండెను.

మైనాకపర్వతంబు జలంబులనుండి పైకిఁ దృలమావి హనుమంతున కాహ్లాదదాయకంబుగఁ బ్రవర్తిల్లె. తనకించుకయు నలసట లేకుండుటవలనను, వ్యవధి చాలనందునను మైనాక పర్వతంబు తనపై విశ్రాంతిం జెందుమని యభ్యర్థించియు, అతండచ్చట నాగకయే సత్వరంబుగ సేగవలసివచ్చెను.

అంతట మైనాకుం "డో యాంజనేయా! సత్యయుగంబునఁ బర్వతంబుల కన్నింటికి ఱెక్కలుండెడివి. అవి తమ కిచ్చ వచ్చిన స్థలంబుల నెల్లం దిరుగు చుండెడివి. వాని భారంబు వలన ననేక మృగంబులు మృతి నొందుచుండెడివి. అందు వలనం గుపితుండై యింద్రుండు వజ్రాయుధమునం బర్వత పక్షంబులం దెగ నఱుక మొదలుపెట్టె. ఆ సమయంబున నీ తండ్రి వాయుదేవుని దయవలన నీ సముద్రంబునం బడి బ్రతికితి. నీతండ్రి నాకంత సహాయంబు చేసినందునకు, నీవు నా శిఖరంబునం గూర్చుండి కొంచె మలసటం దీర్చికొని రుచ్యంబు లగు ఫలంబుల భుజింతువేని, నేనుం బ్రత్యుపకారం బించుక చేసినవాఁడ నగుదు" నని విన్నవించె.

అపు డాంజనేయుండు "పర్వతోత్తమా! సాదరంబు లగు నీ పలుకులవలన మితి మీఱిన యానందముం బొందితిని. నాకుం జాల పని యున్నది. నన్ను క్షమింపు" మని మైనాకుని స్పృశించి "నేను విశ్రమించితి ననియే యెంచు కొ" మ్మని వెడలిపోయెను. హనుమంతుని సామర్థ్యదీక్షలం గనుంగొనవలె నని కుతూహలంబున దేవతలు నాగమాత యగు సురసం బిల్చి యతనికిం బథమధ్యంబున విఘ్నంబులు ఘటింపు మని చెప్పిరి. వారి యాజ్ఞ ప్రకారము సురస భీషణాకారంబు దాల్చి హనుమంతుని యెదుట నిలువం బడ, నతం డా రక్కసిం జూచి తన దేహముం బెంప నారంభించెను. అంతకన్న నెక్కుడుగ నా రక్కసియుం దన

రొమ్ముడలు పొడిగింపం దొడంగెను. ఉపాయాంతరంబు గావక యాంజనేయుం డంగుష్ఠ మాత్రుండై రాక్షస వక్త్రంబుం జొచ్చి బహిర్గతుండయ్యె. అట్లతండు సురసను మోసపుచ్చి పోవుచుండ నింకొక రక్కసి యతని నెదుర్కొనియె. దాని పేరు సింహిక. హనుమంతుండు దానిం గూడ భంగపఱచి దాని యుదరంబునం బ్రవేశించి ప్రేవు లెల్ల భేదించి వెడలి పోయెను.

లంకాపట్టణంబు సమీపించుట వలన హనుమంతున కదంతయు దృష్టిపథంబునం గట్టిన ట్లుండెను. ఆ పురంబు విజయ పతాకలతోడను, స్వర్ణ సౌధంబులతోడను, శృంగార వనంబులతోడను, కనక ప్రాకారంబులతోడను దేదీప్యమానం బుగఁ బ్రకాశించుచుండె. లంబ పర్వతంబులపై విశ్వకర్మ స్వయంబుగా నా పురంబును బంగారంబుతోఁ గట్టె. అది స్వర్గంబువలె శోభిల్లుచుండె. శస్త్రాస్త్రపాణు లగు భటులు దాని గాచుచుండిరి. హనుమంతుండు ధైర్యసాహసంబులతో నుత్తర ద్వారంబు చేరెం గాని పట్టపగంట నగరు సొచ్చిన రాక్షసులు కనిపెట్టెద రని యెంచి యణుమాత్ర దేహుండై నిశాసమయంబునం బురంబు ప్రవేశించె. అప్పుడు భీషణా కారంబు గల యొక రాక్షసి యతని నెదిరించి "నీ వెవండవు? ఎక్కడనుండి వచ్చితివి? సత్యముం బలుకుము. పలుక వేని నిన్నుం జంపెద" నని బెదరించె. "ముందు నీ వెవ్వతెవో ఎదుల కిట్లు కోపంబు చేయుచున్న దానవో చెప్పు" మ!

హనుమంతుండు మరల ప్రశ్నించెను. "నే నీ లంక కధి దేవతను; లంకిణి యనుదాన. రాక్షసులు నన్నుం బూజింతురు. నేను లంక గాపాడుచుందు. నీ వీ దినంబు నా చేతం జత్తు"వని యా రక్కసి ప్రత్యుత్తరం బిచ్చె. అంత నాంజనేయుండు "పట్టణముం జూడవచ్చితి" నని నిర్భయుంబుగఁ జెప్పెను. అది "నన్నోడింపకున్నం బురంబుఁ బ్రవేశింపంజాల" వన, "నేను నిరాటంకంబుగఁ బ్రవేశింతు జూడు" మని హనుమంతుండు దాని నదలించె. అంతట రక్కసి యాగ్రహించి యాంజనేయునిం దన యఱచేతం బఱచెను. పవనందనుండు క్రుద్ధుఁడై దానిం గ్రిందఁ బడునట్లు పిడికిటం బొడిచె. అటు పొడువగనే యది మూర్ఛిల్లి కొంత తడవునకుం దేఱి తెచ్చుకొని "తండ్రీ రక్షింపుము; వానరునిచే నే నెప్పు డపజయంబుగాంతునో యప్పుడే లంకకుం జేటు వాటిల్లు నని శాపంబు కలదు. ఆ సమయం బిప్పు డానన్నం బయ్యె; నీవు పురంబుం బ్రవేశించి నీయిచ్చవచ్చినట్లు సేయు" మనియెను. వాయుసూతి నగరంబుం బ్రవేశించి కొంచెమైన శంక లేక వారణవాజి శాలలు దేవాలయంబులు మున్నగు నెల్ల ప్రదేశంబుల సీతాదేవి నన్వేషించె. కాని, యెత యెందుం గాన్పింపదయ్యె. విశ్వకర్మ బ్రహ్మకొఱకు నిర్మించిన నవరత్నఖచితం బగు పుష్పకం బతని దృష్టిపథంబునం బడియె. ఆరథంబును బ్రహ్మ కుబేరున కిచ్చె. రావణుండు దానిం గుబేరునినుండి బలాత్కారంబునం గైకొనియె. హనుమంతుం డా రథం బెక్కి రావణుని స్వర్ణసౌధం

బంతయుఁ బరిశోధించెను. రావణుని గృహంబునం దంగనలు శయనించి యుండిరి. దైత్యనాథుని సౌధంబు స్వర్ణమయ వాతాయనంబులును, మణిమయ సోపానంబులును దంతనిర్మిత పాంచాలికలును స్ఫటిక స్తంభంబులును గలిగి మిగులఁ బ్రకాశించుచుండె. దశకంఠుని పాన్పు స్ఫటిక వేదిపై విలక్షణంబుగ వెలయుచుండె. మణిమయప్రతిమలు, వింజామరంబులు వీచు విధంబునం గనుపట్టు. హనుమంతుండు రాణి యగు మండోదరిం గాంచి సీతాదేవి యని మొదట భ్రమించెగాని, సీత యంతనిశ్చింతంబుగ నెన్నండు నుండ దని తలంచి యాస్థలంబును విడిచి కొండక తావునకుం జనియె. రావణుని భోజనాగారంబున నాహారంబు భుజించుచుఁ గొందఱు నిద్రాపరవశులై యుండిరి. పసిఁడి కంచంబులు నానావిధమృష్టాన్నంబులతోడ నిండియుండె. అయ్యెడ దేవకన్యలు, నాగకన్యలు మొదలగు సుందరు లుండిరి. వికట స్వరూపు లగు రాక్షసస్త్రీలుం గలరు. అం దెందును సీత మాత్రము గోచరింపదయ్యె. భూజాత నెందుం గానక "యామె ప్రాణంబులు విడిచెనో! లేక రావణుం డామెను భ్రమింగెనో"? యని పరిపరివిధంబులం బరితపించి హనుమంతుండు తాను గూడ మృతినొందుటకే నిశ్చయించుకొనెం గాని యింకను నెలతావులుం బరిశీలింపవలయు నను దృఢసంకల్పంబుతో నశోకవనంబుం బ్రవేశించె. అవ్వన బునం దప్పుడే సీత కాన్పించు నని తన యంతరాత్మకు స్ఫురింప, నతం డయ్యెడం గలయ వెదకుచు నొక వృక్షంబు క్రింద నొక యబల కూర్చుండి యుండుటం గాంచె. ఆమె

నిరుపమాన సౌందర్యవతియైనను గడు విచారంబున మలిన వస్త్రధారిణియై శుష్కించి యుండెను. పలువురు రాక్షసస్త్రీలామెం బరివేష్టించి నానావిధ కఠినోక్తులం బలుకుచుండిరి. అనవరతం బా యింతి బాష్పవారిం గురియుచుండె. హనుమంతుం డామెం గాంచి సీతగా నిశ్చయించి రాక్షసు లామె యొద్ద నుండుటవలనం బ్రిభ్రాంతంబునకై నిరీక్షించుచుండె; అచటి రాక్షస స్త్రీలలోఁ గొందఱు దీర్ఘకాయంబులు గలవారుగను, గొందఱు గూని వీపులు గలవారుగను, మఱి కొందఱు గ్రుడ్డివారుగను నుండిరి. కొందఱి కర్ణంబులు గజకర్ణంబులవలెను, గొందఱి శ్రోత్రంబు లశ్వశ్రోత్రంబులవలెను నుండె. కొందఱి కాయంబులు కంబళంబులవలె నుండెను. కొందఱి ముఖంబులు వ్యాఘ్రముఖంబులవలెను, కొందఱి యాస్యంబులు శునకాస్యంబులవలెను, మఱికొందఱి వదనంబులు వరాహ వదనంబులవలెను నానావిధంబులుగ నుండె. కొందఱికి గజదంతంబులం బోలు దంతంబులు గలవు. ఇట్టి వీరందఱు నాయుధహస్తలై నలువైపుల నిలువంబడి సీతాదేవికిం గావలి గాచుచుండిరి. నడురేయి రావణుం డరుదెంచి మధురవాక్యంబులతో సీతను సంతుష్టురాలిం జేయఁ బ్రయత్నించెం గాని వాని ప్రయత్నంబు విఫలం బయ్యె. వాని పలుకు లామె యాలింపక "ఓరీ! దుష్టాత్మా! రావణా! ఎల్లప్పు డన్యాయం బొనరించుటయే నీ పనియా? శ్రీరామలక్ష్మణులు వచ్చి నీకుం దగిన శాస్తి యొనర్తురు. నీవు నీ మంచి కోరెదవేని నన్ను విడఁబుచ్చి శ్రీరాముని శరణు

జొచ్చి యతని సంతోష పఱుపుము. అటు చేయవేని నీవే కా నీ ప్రజలందఱు నశింతు" రని నొక్కి వక్కా ణించెను. ఆ మాటలు విని రావణుండు మండిపడి కట కటంబు లదుర, "సీతా! ఇఁక నీకు మాసద్వయంబు వ్యవధి యిచ్చుచున్నాఁడ; అప్పటికైన నీవు నా చెప్పిన చొప్పున నొప్పుకొనవేని నిన్నుం జంపి తినెద" నని బెదరించె. సీతాదేవి "నేనే పూనుకొన్నచో నిన్నెన్నఁడో భస్మీపటలంబు సేసియుందుఁ గాని శ్రీరాముని యనుమతి లేనందున మిన్న కుంటి" నని ప్రత్యుత్తరం బిచ్చెను. ఆ పలుకు లాలించి వాక్కలహంబునఁ బ్రయోజనంబు లేదని తెలిసికొని యసుర స్త్రీలను "బోధించుచుండుఁ" డని యాజ్ఞాపించి వెడలిపోయెను. రావణుండు చనిన యనంతరంబు రాక్షసస్త్రీ లందఱు సీతాదేవిని దమ యిచ్చవచ్చినట్లు మనుపటికంటె హెచ్చుగం దుచ్ఛవాక్యంబుల దూషింపఁజొచ్చిరి. అంతట విభీషణకూఁతురు త్రిజట యను రక్కసి యేతెంచి "మీరు సీతాదేవిం గష్టపెట్టకుఁడు; నేను దుస్స్వప్నముం గంటి; రావణుండు చచ్చునో, లంకయే నాశం బగునో? మీరు సీతం దిట్టుచున్నందుల కామె యడుగులం బడి క్షమాపణ వేఁడుకొనుం" డని మందలించె. అంత రాక్షసస్త్రీలు "మా యపరాధంబు మన్నింపు" మని సీతం బ్రార్థించిరి. "త్రిజట చెప్పినట్ల యగునేని మిమ్ముం గాపాడెద" నని సీత వారి నూరార్చి మరల నేడ్వం దొడంగె. అశోక వృక్షంబు కడకుం జని యామె తన శిరోజంబులతో గంఠం బున కురి వైచుకొని ప్రాణంబులు విడుచుటకుం బ్రయ

త్నింపఁజొచ్చె. ఆ సమయంబున నామెం గావలి గాచుచున్న రాక్షసస్త్రీ లందఱు నిద్రించుచుండిరి. బలాత్కారంబునం బ్రాణంబులు విడువనున్న సీతం జూచి మరున్నందనుం డామె యురి వెట్టుకొనుచున్న శాఖమీఁదుగ నామెను సమీపించి "దశరథమహారాజు తనయుండగు శ్రీరాముం డనుజుం డగు లక్ష్మణునితోడను ధర్మపత్ని యగు సీతతోడను బినతల్లి యాదేశంబున వనంబునకు వచ్చె. క్రూరాత్ముం డగు రావణుండు శ్రీరాముని మోసపుచ్చి సీతాదేవి నెత్తుకొని వచ్చెను. వారామెను వెదకుచు వచ్చి సుగ్రీవునితో మైత్రి నెఱపిరి. "సీతాదేవిని వెదకుం" డని యినజుండు మమ్ముం బంపె; దేశదేశంబులు వెదకితిమి, తుదకు సంపాతి చెప్పిన చొప్పున నే నిచ్చటికి వచ్చి లంక యంతయుం బరికించి తల్లి! నేఁటికిచ్చో నిన్నుం గాంచితి" నని విన్నవించి మిన్నకుండె. హనుమంతుని మాటలు విని విస్మయంబున దిక్కులు చూచుచుండ, నొక వానరుండు తనకు నమస్కారంబు సేయుచు సీతకుం గాన్పించె. వాని శరీరం బశోకపుష్పముం బోలె. రక్తవర్ణంబుగను నేత్రంబులు స్వర్ణవర్ణంబుగ నుండెను; మఱియు నతండు ధరించిన వస్త్రంబులు ధగద్ధగాయమానంబులై స్ఫటికవర్ణంబున నలరారుచుండె. హనుమంతునిం జూచి సీత ప్రథమంబున భయంపడెను గాని పిమ్మట దేవతలం దలంచుకొని "యో దేవతలారా! మీకు నమస్కారంబు. ఈ చిన్న వానరంబు సెప్పు విషయంబులు సత్యంబులే?" యని ప్రశ్నించె. అంతట హనుమంతుండు వృక్షంబు నుండి

దిగి వచ్చి సీతాదేవికిం బ్రణమిల్లి "అమ్మా! నీవే రేమి?
నీ వెందుల కిట్లు దుఃఖించుచున్నావు? తల్లీ! నీవే
శ్రీరాముని యిల్లాలయిన సీత వైనచో నాకుం బ్రత్యుత్తరం
బనుగ్రహింపు" మని ప్రార్థించె. అతని వాక్యంబు లాలించి
సీతాదేవి "నేను దశరథపుత్రుండగు శ్రీరామచంద్రుని ధర్మ
పత్నిని; నా జనకుండు జనకరాజేంద్రుండు. కైకేయి యాజ్ఞ
చొప్పున శ్రీరాముం డడవికిం బైలువెడల, నేనును నామ
ఱంది లక్ష్మణుండును నతనితో వనంబునకు వచ్చితిమి.
ఈ దుష్టరావణుండు నన్నుం బర్ణశాలయం దొంటిపాటున
నున్న తఱి లంక కెత్తుకొని వచ్చె; మాసద్వయంబు గడచిన
నన్నుం జంపం దలంచియున్నాఁ" డని పలికి, మరల సంశ
యించి రావణుండే యీ వేషంబున వచ్చి యిట్లు పలుకు
చున్నాఁడేమో యని యెంచి మనస్ఫూర్తిగ మాటలాడ
భీతిల్లఁజొచ్చె. హనుమంతుం డామె భీతిని గ్రహించి "తల్లీ!
భీతిల్లకుము. నేను మాయావిని గాను; దశరథ తనయుని
బంటును; సుగ్రీవుని సచివుండను; వాయుసూనుండ; నాంజ
నేయుం డనువాఁడ" నని యామెకు నచ్చఁజెప్పెను. అంత,
సీత "యో కపివరా! నరులకు వానరులతోడ స్నేహం బెట్లు
వాటిల్లె?" నని ప్రశ్నించె. "శ్రీరాముఁడు నిన్నుం గోల్పోయి
వెదకుచు వచ్చి సుగ్రీవుని పరిచయంబు చేసికొని యతనిం
గిష్కింధాపురాధీశ్వరుం జేసె. సుగ్రీవుండు భవదన్వేషణార్థ
మై నన్నుం బంపు తఱి శ్రీరాముఁడు తన వ్రేలి యుంగరం
బును నీ కానవాలుగ నిమ్మనె" నని వచించి యా యుంగరం

బును సీతాదేవి కొసంగెను. సీతాదేవి యా ముద్రికం జూచి హనుమంతుం జేరం బిలిచి "రఘుకులాంభోధి చంద్రుం డగు శ్రీరామచంద్రునకుం గుశలంబే కదా! సౌమిత్రి క్షేమం బున నున్నవాండె! నన్ని క్రూరదానవులు హింసించి భక్షింపక మున్న యినకులతిలకుం డేతెంచి రావణుం బరిమార్చి నన్ను రక్షింపండా? సౌమిత్రికి నాయందు దయతప్పెనా యేమి? "నేన తని నాడిన క్రూరవాక్యంబులు మనంబున నుంచుకొనవల" దని బోధించి "మీానదినెం గావాడు" మని చెప్పుము. నేను జీవంబుతో నుండుట యింక రెండు మాసంబులు మాత్రమే. ఈ గడువు లోపలనే వారు తమ పౌరుషంబు వెల్లడించి యనద నగు నన్ను రక్షింపంగల్గుట. "పిమ్మట మీారు శ్రమపడవలసిన పనియే యుండ"దని యనేక ప్రకారంబుల శ్రీరామలక్ష్మణు లకు నామాటలుగ విన్నవింపు" మని ప్రార్థించి, మఱియుం గొన్ని ప్రశ్నంబు లడిగి హనుమంతునిపలన బ్రత్యుత్తరం బులం బడసె. పిమ్మట నాంజనేయుండు "తల్లీ! నీవు సమ్మ తించెదవేని యిప్పుడ నిన్ను నా భుజంబుల నిడుకొని శ్రీరామ చంద్రుని సన్నిధానంబునకుం గొనిపోవంజాలుదు" నని విన్న వించె. సీత యందుల కొప్పుకొనకపోవుటచే నతం డామె యొద్ద సెలవు గైకొనంబూని "రామచంద్రునకుం జూప నానవా లేదేని యొసంగు" మని యామె నభ్యర్థించెను. అంతట నామె తన వేణీభరంబునం బరలపఱచి యుంచుకొన్న మాణిక్యంబు నానవాలుగ నొసంగెను. అనంతరము వాయు నందనుండు ధరణీనందనయొద్ద సెలవు దీసికొని ప్రణతుండై

బయలు వెడలు "క్షోణీసుతం గనుంగొంటి. ఇంక రాక్షస
బలంబుల బలం బరయుదుం గాక! దీని కేమి యుపాయంబు?
ఈ యశోక వనంబుం బాడుచేసినయెడ నాతో యుద్ధంబు
సేయ రాక్షసు లేతెంతురు. అప్పుడు వారి పౌరుషంబు బయ
ల్పడు" నని దలంచి యశోకవనం బంతయు ధ్వంసంబు
సేయందొడంగె. హనుమంతుండు మనోహరం బగు నవ్వనం
బునం గల ఫలవృక్షంబుల నన్నిటిం బెకలించి తోరణ స్తంభం
బెక్కి కూర్చుండె వన వినాశన సమాచారంబు దైత్య
భటులు తెలిసికొని రాక్షస నాథునికడ కరిగి, "వాడెవండో,
రాముండు పంపినవాండు కానోపు. సీతతో మాటలాడి
యామె యున్న వృక్షంబు మాత్రము విడిచి తక్కిన యారా
మం బంతయు నొక్కండ పాడుసేసె" నని చెప్పిరి. దశకం
ఠుండు వారి మాటలు విని రోషావేశ పరవశుండై పవనాత్మజు
నితో యుద్ధంబు సేయ ననేక రాక్షస వీరులం బంపె. ఏడుగురు
సైన్యాధిపతులును, ఏడుగురు మంత్రిపుంగవులును హనుమం
తునిచే యమపురంబునకుం బంపంబడిరి. దశకంఠుం డక్ష
కుమారునిం బంపె; వాండును వాతాత్మజునిచే నేలంగూలె.
కుమారు మరణముంగూర్చి విని కన్నుల నీ రొలుక దుఃఖించి
యతండు మేఘనాథునిం బంపె. "నే నా కోంతిం బట్టి తెచ్చె
ద"నని యింద్రజిత్తు శపథంబు పలికి రథారూఢుండై
యుద్ధంబునకుం జని వాయు సూనునిపై నిశితాస్త్రంబులు
వఱపె. వాయుతనయుండు వాని రథరథ్యంబులం గూల్చె.
మఱి యుపాయంబు గానక యింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబుం

ప్రయోగించె. పవనపుత్త్రుం డా బ్రహ్మాస్త్రంబునకుం గట్టు వడినంతనే రాక్షసు లతనిని రజ్జుబద్ధునిం గావించి యసురేంద్రుని కడకుం దోడ్కొనిపోయి చూపిరి. రాక్షసు లాడఱు నింద్రజిత్తు సామర్థ్యంబునకుం బరమానంద భరితులైరి. బ్రహ్మాస్త్ర బంధనంబు వీడిపోయినను రాక్షసుల కది తెలియనీయక మూర్ఛిలినవానివలెం బడియున్న తన్ను వారె.త్తికొట్టి యీడ్చి బాధించినను హనుమంతుండు కలంగక మెల్లగం గనులు విచ్చి రావణుం జూడఁజొచ్చెను. స్వర్ణమయ మకుటాలంకృతుండును, నవరత్నఖచిత సింహాసనాసీనుండు నగు దశకంఠుని భీకరాకారముం గాంచిన కొలంది నతని కద్భుతంబును, గోపంబును జనింపందొడంగె. రాక్షసులు బహువిధంబుల ననిలాత్మజు బాధించుచున్న సమయంబున దానవమంత్రి యతనిం జూచి "వానరా! నీ విచ్చట కెందులకు వచ్చితివి? నిన్నెవ్వరు పంపిరి? అశోకవనం బెందులకు నాశనంబు చేసితివి? దైత్యవరుల నెందులకుఁ జంపితివి? నిజంబు పక్కాణింతు వేని నిన్ను విడిపింతు" నని పలికెను. దానికిం బ్రత్యుత్తరంబుగా హనుమంతుండు రావణు నుద్దేశించి "ఓ దానవరాజా! నిజము చెప్పుచున్నాఁడను వినుము. నేను సామాన్యవానరుండను: నిన్నుం జూడ నిందుల కేతెంచితిని; నీ దర్శనంబు దుర్లభం బగుటం జేసి నే నశోకవనంబు ధ్వంసంబు గావించితి. ఆ సమయంబునం బలువురు రాక్షసులు నన్నొక్కని సుక్కిడంపఁబోవ, వారిం జక్కాడితి. నేను శ్రీరాముని దూతను; వాయుకుమారుండను; ఆంజనేయుండను

వాఁడ. ఇంత ధన, ధాన్య సమృద్ధి తోడను, బుత్త్ర, మిత్ర, కళత్త్రాది సంపత్తి తోడను దులఁదూగు నీ వెందుల కన్యాయంబుగా సంచరించెదవు? నా మాట వినుము. నీ మంచి కొఱకే చెప్పుచున్నాను. నీ విపుడేని బుద్ధి తెచ్చుకొని సీతను రాముని కప్పగింపుము. అర్పింప వేని నీకు మరణకాలం బాసన్నం బయిన దనుకొనుము. మా రాజేంద్రుండు నా కనుజ్ఞ యిచ్చి యున్నచో నింతకుమున్న లంకా పట్టణంబును బాతాళంబునం గల్పియుండుదును" అని గంభీరోక్తులం బలికె. హనుమంతుని వాక్యంబులు విని రావణుండు నేత్రముల నిప్పులు రాల్చుచు "వీనిం జంపు" డని రాక్షసుల కాజ్ఞాపించెను. రాక్షసులు వాయునందనుం జంపం బ్రయత్నించుచుండ, విభీషణుండు "దితికులచంద్రా! దూతి వధ్యుండు గాఁడు. వీనిం జంపిన రామలక్ష్మణుల కీ సమాచారం బెట్లు తెలియును? తెలియనిచో వారిచ్చటి కెట్లు వచ్చి మన రాక్షస వీరుల శౌర్యముం గాంచఁగలరు? కావున వీని కేదేని యొక శిక్షం గావించి పంపుట యుచితం" బని యుపదేశించె. అంతట రావణుండు "దైత్యులారా! ఈ వానరంబు వాలంబున కగ్నిం దరిగొల్పుం" డని యానతిచ్చె. తోడనే దైత్యవీరులు మితిలేని వస్త్రంబులం దెచ్చి తైలంబున ముంచి యాంజనేయుని వాలంబునకుం జుట్టసాగిరి. వారు తన వాలంబునకుఁ దైల వస్త్రంబులు చుట్టుచున్న కొలంది నతండు తోఁకం బొడిగింపఁ గడంగె. ఎన్ని వస్త్రంబులు చుట్టినను వాలంబు

నకుం జాలకుండె. ఇట్లు వారు చుట్టి నిండుగం దైలంబు పోసి దాని కనల జ్వాల లంటించిరి.

వ్రిథమంబున నాంజనేయుండు మండుచున్న వాలం బుతో రాక్షసులం గొట్ట మొదలుపెట్టెను. అతండు కొట్టు చున్న కొలంది వారు తోకకుం బుట్టంబులు చుట్టుచుండిరి. ఈ వార్త సీతాదేవికిం దెలిసి "నేను సుశీలనేని హనుమంతుని కగ్నిదేవుండు చల్లందన మొసంగుంగాక! " యని ప్రార్థింప నొడంగెను. తన వాలం బగ్ని విజృంభించి ప్రజ్వలించుచున్నను గాలక చల్లగా నుండుటం గాంచి" యిది యంతయు సీతా రామలక్ష్మణుల యనుగ్రహంబే కాని వేఱొండు కా" దని భావించి హనుమంతుండు వారి నతిభక్తిమై సంస్మరించి తన దేహంబును సూక్ష్మంబు గావించుకొని రాక్షస సమూహముం దప్పించుకొనిపోయి గంతులు వేచుచు నలుప్రక్కల నున్న యిండ్లెల్ల నిప్పంటించెను. విభీషణుని మందిరంబు దక్క దక్కిన లంకాపురంబందలి గృహంబు లన్నియు దగ్ధంబు లయ్యె. అంతట హనుమంతుండు వేవేగ సీతకడ కేగి "దేవీ! యింక నేబోయి వచ్చెద సెల వొసంగు" మన, నామె కనులం బాష్పంబులు రాల్చుచు "నిన్నుం జూచి నే నింత తడవు బ్రతికితిని లేనియెడల బ్రాణంబులు విడిచి యుండు" నని విలపింప దొడంగెను. తల్లీ! యనుజ్ఞ యిత్తువేని నిన్ను శ్రీరాము సన్నిధిం జేర్చెద" నని యాంజనేయుండు పలుక, "నీవు వైళంబ చని "వానరసేనాసమేతంబుగ వచ్చి

రావణుని వధించి నన్ను దోడ్కొనిపొ” మ్మని శ్రీరా మునితోఁ జెప్పుము. నేనంతవఱకు కెట్లయిన నోర్చుకొని జీవించియుందు” నని సీత మాఱు వలికె. అది విని “మహా ప్రసాదం” బని యాంజనేయుండు సీతాదేవియొద్ద సెలవుం గైకొని లంకా సమీపంబున నున్న యరిష్టి పర్వతంబునకుం బోయెం.

హనుమంతుని రాకకై నిరీక్షించుచుం గపు లందఱు మహేంద్రపర్వతంబు కడ నుండిరి. వా రందఱుం దదేక దృష్టిం జూచుచుండ హనుమంతుం డాకస్మికంబుగ గరుత్మంతుండుం బోలె వచ్చి మహేంద్ర గిరిం జేరె. వానర బలం బంతయుం దన క్షేమం బరయుచుండ “జనకజం గనుంగొంటిని. లంకం గాల్చి వచ్చితిని. ఇఁక ధర్మణీకాంతుని చెంతకుం బోదము రం” డని యాంజనేయుం డందఱం గూడి పయనంబయ్యె. వారు వాయువేగంబునం గిష్కింధాపురంబు చేరి సమీపంబు నం గల మధువనంబుం బ్రవేశించిరి. అంగదుండందఱి మధు వాస్వాదింపుం డను కనుజ్ఞ యొసంగ, స్వాదు ఫల భరితం బగు నా మధువనంబును గపు లెల్లరు విధ్వస్తంబు గావించిరి. వన పాలకు లెంత వలదని వారించినను వినక వారింబట్టి కొట్టిరి. అంత వనపాలకులు కపికులేశ్వరుని కడకుం జని యీ వృత్తాం తంబు విన్నవింప, జానకీదేవిం గనుంగొని యుండుటవలననే వా రట్లు చేసియుందు రని గ్రహించి సుగ్రీవుండు వారిం దోడ్కొని రా నాజ్ఞాపించెను. హనుమదాదులు వచ్చిన

వెంటనే యందఱు నానందంబునం దేలిరి. హనుమంతుండు వృత్తాంతం బంతయు సవిస్తరంబుగ వినిపించి "సీతాదేవి యొసంగిన చూడామణిం దెచ్చితి నిదె చూడుం" డని శ్రీరామున కొసంగె. శ్రీరాముఁడు దానిం దిలకించి పరిపరి విధంబుల విలపించి వక్షస్థలంబునం జేర్చుకొని హనుమంతుం గొనియాడి భూజాత జీవించియున్నందుల కెంతయు సంతోషించె.



శ్రీ ర స్తు.

# సీ తా రా మ ము

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

భూనభోంతరంబులు మహారావంబుల నిండి నలుదిక్కులు ఘూర్ణిల్లుచుండె; లంకాపట్టణం బంతయు సముద్రంబు పాలు కావలసిన దినంబులు వచ్చిన వని కిష్కింధాపురంబందలి వనచరు లెల్ల సంతోష ధ్వానంబులఁ జెలరేఁగుచుండిరి. 'యుద్ధంబునకు నేన ముందుగ సంసిద్ధుండ' నైతినని యొక్కొక వానరుండును గేకలు వెట్టుచుండె. 'సీత జాడం దెలిసికొని మన మంత్రిపుంగవుం డగు హనుమంతుండు రామలక్ష్మణ సుగ్రీవుల కానందంబు గల్గించి కీర్తివంతుం డయ్యె' ననెడి యభినందన నినాదంబులు మిన్ను ముట్టె. మంగళ వాద్య ధ్వానంబులును, జయభేరీ భాంకారంబులుం బోరుకొన నెల్లరు లంకాపట్టణంబుపై దాడి వెడలిరి. నలునకు లంకా పథంబు స్పష్టంబుగఁ దెలియును. ఎచ్చట మంచి మంచి ఫలవృక్షంబు లున్నవో ఏవంకం బోయిన చాల బాగుండునో అది యంతయు నెఱింగి యుండుటవలన నతండే సైన్యంబునకు దారిం జూపఁజొచ్చెను. తక్కిన వా రందఱు వాని వెను వెంటనే పోవఁదొడంగిరి. ఇనకులేశ్వరుం డగు శ్రీరామచంద్రుఁడు మారుతాత్మజుని భుజపీఠంబును, లక్ష్మణకుమారుండు తారాసుతుని భుజపీఠంబును నలంకరించిరి. వారిం బరి

వేష్టించి వనచరానీకంబులు నడచుచుండె. ఇట్లు వా రరణ్యం
బులు, నహార్యంబులు, దరువరంబులు వడివడిం దాటుచు
గంతులు వైచుచు నిడుద వాలమ్ముల నిగిడించి ఫలంబులు
మెక్కుచు మధుపానంబు సేయుచుఁ బుష్పసౌరభశోభం
గాంచి యానందించుచు మహేంద్రపర్వత ప్రాంత సముద్ర
తీరంబున కరిగిరి.

అక్కడ లంకేశ్వరుండు కడుంగడుఁ జింతాక్రాంతుండై
మంత్రులం బిలిచి "సచివశేఖరులారా! నిన్న మారుతాత్మ
జుండు మహిమంబు మీఱ ఘటించిన కార్యంబుం జూచితిరి
గదా! వాఁడు కొంచెమయినం జంకుగొంకులు లేక మన
పురంబుం జొచ్చి యవనిజం గాంచి వన వినాశనం బొనరించి
వైరులం ద్రుంచి లంకం గాల్చి పోయె. ఇఁక మన మేమి
చేయుద?" మని ప్రశ్నించె. "లంకేశ్వరా! తొల్లి సమరం
బున నమరులం గెల్చితివి. స్వర్గ మర్త్య పాతాళంబులందు
నీ సమానులు లేరు. వానరు లనెంతవారు? మఱి, నరు
లన్న నెంతవారు? ఊరక దీనాలాపంబు లేటి కాడెద" వని
మంత్రు లతనిం బురికొల్పిరి.

అంతం గుంభకర్ణుండు వచ్చి "అన్నా! శ్రీరామ పత్ని
యగు సీతాదేవి నేఁదులకుం దెచ్చితివి? రాముని గెల్వ
నేరికిం దరంబు గాదు. సీతాదేవిని శ్రీరామున కిచ్చివేయు"
మని హితోపదేశంబు గావించె. అతని వచనంబులు విని మేఘ
నాథుండు "మనకు నరులుం గరులుం గోఁతులుం గీఁతులు

నెంతమాత్రము? నేను సురపతిం గెల్చిన శూరుండను. నాకిది యొక ఘనకార్యంబుగాదు. నేనిప్పుడ చని వారిం దెగటార్చెదం జూడు"మని ప్రగల్భంబులు వల్కె. అంత విభీషణుండు "మహారాజా! రామునకు శక్తి లేనియెడ నతండు నీతో యుద్ధంబొనరింప నీ లంక కేల వచ్చును? అతని ప్రియపత్ని యగు సీతాదేవిం బ్రియంబున నతని కొసంగి నీవుం బ్రియుండవు కమ్ము. రాముండు సామాన్యుండు కాడు. నా మాట మన్నించి మహీజాతను విడువుము. లేనియెడం గులక్షయంబు సంప్రాప్తంబగు" నని నొక్కి వక్కాణించెను. అప్పు డసురేంద్రుం డుగ్రుండై "ఓరీ! నా యనుకూర్చు భోగంబు లెల్లం జెకతేర ననుభవించుచు మతిలి యిచ్చ వచ్చినట్లు ప్రేలంజొచ్చితివా? 'దాయలే శత్రువు' లనెడి లోకోక్తి యథార్థం బయ్యె. ఇప్పుడే దశరథసుతుని తల ద్రుంచెదం జూడు" మని పరుషోక్తు లాడ మొదలిడెను. అంతట విభీషణుండు భీషణాకారుండై "పితృతుల్యుండ వని ప్రియంబు దెలిపితి; నా తప్పు మన్నింపుము. నీ యిచ్చ వచ్చినట్లు సేసికొ"మ్మని తన కాప్త మిత్రులగు నల్వుర రాక్షసుల వెంట నిడుకొని జలధిం దాటి శ్రీరామునికడ కేగెను. విభీషణుండు శ్రీరామునకు నమస్కరించి "నీ సతిని ముచ్చిలిన పాపిష్ఠుడును, సర్భాగ్యుండు నగు దశకంఠుని తమ్ముండ; విభీషణుం డనువాడ. నీకు దాసుండ. నా యన్నతో భూజాతను సవినయంబుగ నీ కొసంగు మని చెప్ప, నతండు నన్నిలు వెడలంగొట్టి చంప నుంకించెను. నేనతనికి వెఱచి నీకడ కరుదెంచితి. నేను నిజంబుగ నిన్నుం

జేర వచ్చితి. నీ కిష్టంబేని నన్ను నీయొద్ద నుండనిమ్ము. లేనియెడ నన్నుం జంపి పుణ్యపదవి యనుగ్రహింపు" మని యెంతయు వేడుకొనియె. "ఇనకులతిలకా! వీని మాటలు నమ్మకుము. వీఁడు రావణుని సహోదరుండు. నీ యాజ్ఞ యైనచో వీని నిప్పుడ వధింతు" నని సుగ్రీవుఁ డడ్డువలికె. అంత శ్రీరాముఁడు నవ్వుచు "శరణు జొచ్చిన వాని రక్షించుటయే నా వ్రతంబు. ఇతండు బలవంతుండను భయం బెందులకు? ఎంతటి దుష్టుం డయినను నన్ను వధించుట దుస్సాధ్యము. ఇతండు వంట యింటి కుందేలయ్యె. కావున మీ రితనికై యించుకేని భయం పడవల" దని పలికి యప్పుడ విభీషణుని లంకకుం బట్టాభిషిక్తునిఁ గావించె. అనంతరము సుగ్రీవ హనుమదాదులు "విభీషణా! మహాశయా! ఈ సేనతో జలధిం దాఁటుట కుపాయం బానతీయవే" యని యడిగిరి. "శ్రీరాముఁడు వారిధిం బూజించిన, దాని దాఁటవచ్చు" నని విభీషణుండు మాఱువలికె. అది విని వానరులు జలధి తీరంబునఁ గుశాసనంబు వైచి పూజాద్రవ్యంబులు సమకూర్చి యుంచిరి. శ్రీరాముఁడు మహాభక్తితాత్పర్యంబునఁ బూజించి జలధికిం బ్రణామం బర్పించి నాలుగు దినంబులవఱకు జలధిదేవతా సాక్షాత్కారంబునకై వేచి యుండెను. కాని, సముద్రుం డంతకుం గాన్పింపఁడయ్యె. అంతట శ్రీరాముఁ డాగ్రహపరవశుండై బ్రహ్మాస్త్రంబున నుదధి నింకింప నుంకింప జగం బంతయు నల్లకల్లోలం బయ్యె. దేవతలు భీతిల్లిరి. సముద్రుండు ప్రాణభయంబున నతనియొద్ద కేతెంచి రత్నాంజలి సమర్పించి యతని సంతు

ప్రాంతరంగునిం జేసి కరంబులు ముకుళించి "అనఘా! నా కుత్తరంబున దుర్మతులు గలరు. వారు రేయింబగళ్ళు నన్ను మిగుల బాధించుచున్నవారు. భువనేశా! నీవట కేగి నీ యస్త్రంబున వారిం దోలింపు" మని ప్రార్థించె. అంతట శ్రీరాముఁడు వారిం దక్షణంబ చంపెను. అప్పుడు "విశ్వకర్మ పుత్త్రుం డగు నలుండు సేతుబంధనంబు గావించినచో మీరు నన్నుం దాఁటఁ గల" రని విన్నవించి సముద్రుం డదృశ్యుం డయ్యెను. అంతట వానరు లందఱుం బెద్ద పెద్ద బండలను, మ్రాకులను దే నారంభించిరి. నలుం డద్భుతంబుగ నా శిలా వృక్షంబులతో శతయోజనదూరం బగు సేతువు నిర్మించెను. సేతునిర్మాణంబున కాఱు దినంబులు పట్టె. అనంతరము వన చరు లెల్లరు సముద్రము దాఁటి లంకాపురంబుం జేరిరి. 'శ్రీరాముండు లంకం బ్రవేశించె' నను వార్త తెలిసినతోడనే రావణుండు మంత్రులగు శుకసారణులం బిలిచి "శ్రీరాముని సైన్యంబును జూచి రం" డని పంపె. వారు వానరరూపం బులం జన, విభీషణుండు వారిం బట్టుకొని శ్రీరాముని కడకుం దోడ్కొని పోయెను. శుకసారణులు ప్రాణంబులకుం దెగించియే వచ్చిరి. దొంగవేసంబులతో వచ్చెడివారిం జంపి వేయుదు రని వారికిం దెలియును. వారు శ్రీరామునకు మ్రొక్కి "మేము దశకంఠుని యాజ్ఞచే మీ సైన్యంబు లెక్కింప నేతెంచితిమి. మమ్ము రక్షింపుఁ" డని వేడుకొనిరి. అంతట 'శ్రీరాముఁడు మందహాసం బొలయ "మీరు భీతిల్ల కుఁడు. మీరు సైన్యంబు లెక్కించినయెడ నిశ్చితంబుగ మీ

ప్రభువు కడకుం బొండు. లేనియెడ లెక్కించుకొనియె పో వచ్చు" నని వారి కభయం బొసంగె. వారు శ్రీరామునిం గొండాడుచు రావణునికడ కేగి "మహారాజా! యుద్ధంబు వలన నేమియు లాభంబు కలుగదు. వారు మహాశూరులు. సీతాదేవిని శ్రీరామున కిచ్చి వేయు" మని విన్నవించిరి. రావణుండు "మీ రెందులకు భయంపడు చున్నారు? ఈ లోకంబున నన్నెవరయిన జయింపఁగలరా?" యని బీరం బులు వల్కి వారితోఁ దన మేడ యెక్కి శ్రీరాముని సైన్యం బుం జూడసాగెను. అసంఖ్యాక మైన యరాతి సైన్యంబుం గనుంగొని సుగ్రీవాంగద రామలక్ష్మణ హనుమదాదుల పరా క్రమక్రమంబు విని దశకంఠుండు హృదయంబున భయం బందియు భయచిహ్నంబు లణుమాత్రంబును ముఖంబునం దోఁపనీయక యాగ్రహోదగ్రుండై "మీరు వట్టి పిరికి పందలు. ఈ సేనం జూచియా యింత భీతిలితిరి?" రని వారిం దిట్టి యక్కడ నుండి పంపివైచెను. అనంతరము రావణుండు విద్యుజ్జిహ్వుం డను రాక్షస మాంత్రికుని రావించి "శ్రీరా ముని శిరస్సువంటి శిరస్సును, అతని ధనుర్బాణముల వంటి ధనుర్బాణంబులను జేసి తె" మ్మని యాజ్ఞాపించె. వాఁడు వాని నట్లు చేసి యొసంగె. అపు డా కృత్రిమ శిరంబును, ధనుర్బాణంబులను సీతయొద్దకుం గొనిపోయి "ఇదిగో! కడ చిన రాత్రి నిద్రించుచుండ నీ నాథునిం జంపితిమి. లక్ష్మ ణుండు పాఱిపోయెను. హనుమదాదులు చచ్చి పడియున్న వారు. విభీషణుం బట్టి తెచ్చితిమి. ఇంక రామునిపై విచా

రించి యేమి చేయుంగల?" వని రావణుండు నిపుణంబుగ నామెను బెదరించె. ఆ కఠినోక్తు లాలించినంతనే యా సాధ్వీమణి యట్టె మూర్ఛిల్లి కొంతవడికిం దెలిసి దురంత సంతాపంబున హృదయంబు వ్రయ్య శోకింప నారంభించెను. అంతలో నొక పరిచారకుండు వచ్చి రావణునిం దోడ్కొనిపోయెను. రావణాజ్ఞాతత్పరయై సీతయొద్ద నున్న విభీషణపత్ని సరమ సీతాదేవిం జాలఁ బ్రేమించునది. రావణుండు వెడలఁగనే, శ్రీరాముఁడు మృతినొందలే దనియు, యుద్ధంబు కాలే దనియు, రాక్షసులు యుద్ధంబు సేయుటకు భయంపడుచున్నారనియుఁ జెప్పి సరమ యామె నోదార్చెను. ఇట్లు వారిరువురు మాటలాడుచుండఁగనే వానర సింహనాదంబులు వినిపించెను.

శ్రీరాముని సైన్యంబు విడిసియున్న స్థలంబునకు సమీపంబుననే యొక పర్వతంబు గలదు. అచటనే వారు యుద్ధమునకుం బూర్వరాత్రంబు గడపిరి. అక్కడనుండి లంకాపట్టణం బంతయు వారికిం గాన్పించుచుండెను. మఱునాఁడు ప్రాతఃకాలము రావణుం డుత్తర ద్వారంబున నిలువంబడి యుండ, వానిం జూచి సుగ్రీవుండు సహింపలేక వాని యొద్దకేగి వానితో మల్లయుద్ధముం జేసి మరలి వచ్చెను. రావణుండు లజ్జచే మాటాడక యూరకుండెను. శ్రీరామ సైన్యంబు పర్వతంబు దిగి లంకా సింహద్వారంబుకడ కేగి నలుదిక్కులు ముట్టడింపఁ దొడంగె. రామలక్ష్మణు లుత్తరద్వారంబుకడను, నీలాదులు తూర్పుదిక్కునను, హనుమంతుండు పశ్చిమద్వారం

బునను, సుగ్రీవుండు దక్షిణద్వారంబునను రావణుని మా ర్గాన వేచియుండిరి. అప్పు డంగదుండు రావణుని సభకు రాయబారిగం బోయె. రావణుండు బంధుమిత్ర సభ్యులతో బేరోలగంబుండ, నంగదుండు చని రావణునితో "నేను శ్రీరా ముని దూత, నంగదుం డనువాఁడను. వాలి పుత్త్రుండను. మా తండ్రి యింకను నీ జ్ఞప్తియం దుండవచ్చును. 'సత్వ రంబుగ వచ్చి యుద్ధంబు సేయు' మని శ్రీరాముఁడు నిన్నుం గోరుచున్నాఁడు. నిన్ను వధించి విభీషణుని రాజుం జేయ నున్నాఁ" డని తెలియఁ బలికెను.

అంగదుండు రావణునితోఁ దన తండ్రి మాటం జెప్పుచు "మా తండ్రి యింకను నీ జ్ఞప్తియం దుండవచ్చు" నని యెత్తిపొడుచుటకుం గారణంబు గలదు. ఒక పర్యా యంబు వాలి రావణు నోడించెను. రావణుండు మూఁడు లోకంబులలో జయంబు గాంచుచుండుటచే నెవ్వరు వానితో యుద్ధంబు సేయుటకు సాహసించెడి వారుకారు. ఒకానొకదినం బున నెవఁడుం దనతో యుద్ధంబు సేయువారు లేమింజేసి వాలి సంధ్యావందనంబు సేయుచుండ రావణుండు వెనుక వైపున నిలిచి వానిఁబట్టుకొనం బ్రయత్నించెను. అపుడు వాలి రావణుని యిరువది చేతుల నిరు కక్షల నిఱికించుకొని నాల్గు సంద్రంబు లకుం జని రావణుతోడ నఱ్ఱింకులిడెను. రావణుం డుచ్ఛ్వాస నిశ్శ్వాసంబుల కవకాశంబు లేక చాలఁ గష్టపడెను కాని, బ్రహ్మ వరంబునం జేసి మృతి నొందఁడయ్యె.

అంగదుని యీయెత్తిపొడుపు మాటలు విని రావణుం డాగ్రహించి వానిం జంప దైత్యుల కాజ్ఞాపించె. వెంటనే దైత్యవీరులు తన్నుం బట్టుకొనంబోన నంగద కుమారుండు తాన దైత్యవీరులం బట్టుకొని యొక మేడమీఁదికిం దీసికొని పోయి యందఱి నచ్చటినుండి నేలంబడవైచి చంపి యా మేడయంతయు ధ్వంసం బొనర్చి శ్రీరాముని కడకు మగలి చనియె. అంత, నుభయ పక్షంబుల వారును ఘోరంబుగ యుద్ధంబు సేయఁ గడంగిరి. సంఖ్యాతీతంబుగ రాత్రించరులును, వనచరులును మృతి నందిరి. కళేబరంబులు పర్వతంబులవలెం బడియుండె. వాని ప్రక్క రక్తంబు కాలువలయి ప్రవహింపందొడంగె. యుద్ధంబున కంతంబు లేకపోయె.

రావణసేనాధిపతులు లేవు రసంఖ్యాకం బగు సైన్యంబుతో వానరసేనం బ్రతిరోధింప మొదలుపెట్టిరి. రాక్షసులు సింహనాదంబులు సేయుచు నతి భయానకంబుగఁ బోర జొచ్చిరిగాని శ్రీరామునితో యుద్ధంబు సేయంజాలక తుదకుఁ బాఱిపోయిరి. అంగదుఁడును, మేఘనాధుండును ఘోరంబుగఁ బోరసాగిరి. అంగదుం డింద్రజిత్తు రథంబుం బడఁ దన్నె. భూతల సంగ్రామంబున నతని జయింపంజాలనని యెంచి మేఘనాధుండు మేఘమధ్యము నుండి మాయా సంగర మొనర్పసాగెను. అందఱు వానికిం గాన్పింతురు కాని వాఁ డెవ్వరికిం గాన్పింపఁడు. వాఁ డిట్లు మఱుఁగువడి తేజోమయంబులగు బాణంబుల శత్రువీరులపైఁ గురియింప సాగెను. తుదకు

వాఁడు రామలక్ష్మణులపై నాగాస్త్రముం బ్రయోగించెను. ఆ బాణంబు మహాభయంకర సర్పరూపంబులు దాల్చి వారిం గట్టిగఁ బట్టుకొనెను. ఇంద్రజిత్తు కాన్పింపకుండుటవలన వారేమియుం జేయఁజాలరైరి. ఇట్లు వాఁడు రామలక్ష్మణుల నాగపాశబద్ధులం జేసి బహు బాణ పరంపరలచే బాధించి మూర్ఛితులం గావించె. అమ్మూర్ఛితులను మృతులుగా భ్రమసి బహుసంభ్రమంబునం బోయి యింద్రజిత్తు రావణునితో "రామలక్ష్మణులం జంపితి" నని చెప్పెను.

ఇట సుగ్రీవుఁడు, విభీషణుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు మున్నగువారు నేల నొరగియున్న రామలక్ష్మణులం గనుంగొని యేడువఁ దొడంగిరి. వానరులలో సుషేణుం డను వ్రణవైద్యుండు హనుమంతునిం జూచి "క్షీర" సాగర తీరంబున విశల్యకరణి, సంజీవకరణి యను రెం డోషధులు గలవు. చంద్రద్రోణపర్వతంబులపై నవి లభించును. వానిం దెచ్చిన, రామలక్ష్మణుల సచేతనులం గావింపవచ్చు" నని యుపదేశించె. అంతలో ఝంఝామారుతంబు వీవం దొడంగె. భూమి కంపింపసాగె. ఖగంబులు నీడంబులం జేరఁ బాఱె. జలచరంబు లన్నియు భయంపడి కదలకుండె. ఇట్టి యాకస్మిక సంక్షోభంబునకుం గారణంబేమని యెల్లరుం జోద్యం బంది చూచుచుండ, గరుడుండు రామలక్ష్మణు లున్న యెడకొక్క పర్యాన విచ్చేసె. వెంటనే సర్పంబులు భీతిల్లి రామలక్ష్మణులను విడిచి తిరిగి చూడక పారిపోయెను. గరుత్మం

తుండు రామలక్ష్మణుల స్పృశించినంతనే, వారు నిద్ర నుండి మేల్కాంచినట్లు లేచిరి. అంత, శ్రీరాముఁడు గరుత్మంతునిం గాంచి "పక్షీంద్రా! నీ వెవ్వండవు? మహావిపదంబోధినుండి మమ్ము దరిఁ జేర్చితి" వని యభినందించె. "రామచంద్రా! నా పేరు వైనతేయుండు. మిమ్మింద్రజిత్తు నాగపాశంబుచే బంధించె నని విని వచ్చితిని. మీయెడ నాకు భక్తి మెండు. ఈ యుద్ధంబున మీరే జయించెదరు. అందులకు సందేహంబు లే" దని గరుత్మంతుండు వెడలిపోయెను. అంతఁ గపివరులు మిక్కిలి మీఱిన యానందంబు నొంది కోలాహలంబుతో లంకం గంపింపఁజేయ మొదలు వెట్టిరి. "రామలక్ష్మణులు మృతి నొందియు వానరు లెందుల కానందించుచున్నారో" యని శంకించి దశకంఠుండు "వారిం జూచి రం" డని తన పరిచారకులం బంపె. వారు "రామలక్ష్మణులు సజీవులై సుఖంబున్నా" రని తెలుప, రావణుండు మరల భయంపడఁ దొడంగెను.

ధూమ్రాక్షుం డను రాక్షసవీరుని రావణుండు వానరులతో యుద్ధంబు సేయుటకుఁ బంపె. వాని ముఖంబు ఖరసింహవ్యాఘ్ర ముఖంబులు గలసినట్లుండెను. రాక్షసులు వానరులతోఁ బోరాడలేకుంటం జూచి తానే వారిం దఱిమివైచి ధూమ్రాక్షుండు హనుమంతునితో యుద్ధంబు సేయ నుపక్రమించెను. మరున్నందనుం డందఱిం బోరిగొని యొకపర్వతశిఖరంబును విఱిచి పైవైచి ధూమ్రాక్షునిం జంపె.

ఇట్లు మర్కట వీరులచే ననేకు లగు రాక్షసులు మడిసిరి. రాక్షస మరణంబు వానరుల కపరిమితానందదాయకం బయ్యె. ఇట్లానందకందళిత హృదయారవిందంబులతోఁ గపిసేన చెలం గుచుండ, లెక్క లేని రక్కసిమూఁక లుక్కు మిగిలి యొక్క పరి జన్యంబు సేయ నేతెంచెను. దశరథ సుతుండు విభీషణుం గాంచి "యీ వచ్చిన వారెవ్వ?" రని యడుగ, నతం డా రక్షస్సేనాధిపతులం గూర్చి పేరు పేరు వరుసం జెప్పెను. ఆ సైన్యంబున దశగ్రీవుండు గూడ నుండుట నెఱింగి సీతా నాథుం డానందపరవశుం డయ్యె. రావణుం జూచినంతనే సుగ్రీవుండు క్రుద్ధుండై యొక పర్వత శిఖరంబుతో నతనిం గొట్టెను. రావణుం డా పర్వత శిఖరంబు ఛేదిల్లున ట్లొక సాయకం బేయ నది తగిలి సుగ్రీవుండు మూర్ఛిల్లెను. అంత సుషేణుండు మొదలగు వానరవీరులు కొందఱు ఘోరంబుగఁ బోరాడిరి. కాని, రావణుని బాణపరంపరలకుం దాళఁజాలక పోయిరి.

శ్రీరాముఁడు యుద్ధసన్నద్ధుం డగుడు, లక్ష్మణుండు తానే రావణునితోఁ బోరాడెద నని పలికెను. వా రిరువురుం జాలఁ దడ వాయోధనం బొనరించిరి. తుదకు రావణుండు నిస్స్పృహుండై సౌమిత్రిపై నొక శక్తిం బ్రయోగించె. దానం జేసి సౌమిత్రి మూర్ఛాగతుం డయ్యె. రావణుండు నిశ్చేష్టి తుండై పడియున్న లక్ష్మణుం గొనిపోవఁ బ్రయత్నించెం గాని యతని కాయంబును గదల్పలేకపోయెను. అప్పుడు హనుమం

తుండే తెంచి రావణుని వక్షంబు పిడికిటం బొడిచి, యొడలు దెలియక పడియున్న సుమిత్రాపుత్రును నెత్తుకొనిపోయెను. నీలుం డతిసూక్ష్మరూపం బూని రథమునుండి కిరీటంబు పైకిని కిరీటంబునుండి ధనుర్బాణంబులమీఁదికిని దుముకుచు రావణు నస్థిరునిం జేయ నారంభించెను.

లక్ష్మణాగ్రజుండు తానే యుద్ధంబు సేయఁబోవు చున్నాఁడని హనుమంతుం డతనిం దన వీఁపున నెక్కించుకొని పోయెను. వాతాత్మజునిపై దశకంఠునకుఁ గోపంబు మెండు. రావణుం డనేక సాయకశతంబుల నతనిపై ధారాపాతంబుగఁ బఱపె. కాని, యించుకయు లాభంబు లేకపోయెను. శ్రీరాముఁడు రావణుని రథంబును, రథ్యంబులను, సారథిని నుగ్గు నూచంబు గావించెను. వాని కిరీటంబు గూడఁ జిందఱవందఱయై నేలపాలయ్యెను. రావణుండు మిగుల నలసి బాణంబులు పాణిం బట్టజాలకుండెను. రఘుకులేశ్వరుం డది గాంచి "నీవు శ్రమఁ జెందిన ట్లున్నాఁడవు. నేఁటికి నిన్ను విడిచితిని. ఇంటికిం బోయి విశ్రాంతిం బొందుము. మఱియొక దినంబు నీ బలంబు చూచెద" నని హెచ్చరించె. అసురేశ్వరుం డది విని సిగ్గుచేఁదల వంచుకొని లంకాపురంబుం బ్రవేశించెను. అతండు నగరునకుం జని నలుదిక్కుల రక్కసులు నిలుపంబడియుండ సింహాసనాసీనుండై దీర్ఘంబుగ నాలోచించి వితర్కించి తల పంకించి "త్రిలోకంబుల జయించి తుదకు సామాన్య నరుని హస్తంబుల న సమింపనున్నాఁడ. పూర్వము నాతపంబునకు మెచ్చి బ్రహ్మ

వరంబు లిచ్చుచు నేఁ గోరిన తీరున దేవ దానవ యక్షులు నన్నుం జంపకుండున ట్లనుగ్రహింపుఁడి. మనుష్యుల మాట నే నప్పుడు తలంపలేదు. సామాన్య మానవు లిట్టి భయంకరు లయ్యెద రని కలనైనఁ దలంపనైతి. అందువలననే యీ విపత్తు సంభవించినది. మీరు చని కుంభకర్ణుని మేల్కొలుపుఁడు. వాఁడయిన రామలక్ష్మణులం జంపఁగలం డేమో" యని రావణుండు పరివారజనంబుల హెచ్చరించెను.

కుంభకర్ణుండు రావణుని సహోదరుండు. వీరు ముగ్గురన్నదమ్ములు. రావణుండు జ్యేష్ఠుండు, కుంభకర్ణుండు ద్వితీయుండు, విభీషణుండు కనిష్ఠుండు. "ఇంటిగుట్టు లంకకుఁ జేటు" అను సామెత యీ విభీషణునివలననే కలిగెను. ఈ యన్నదమ్ములకుం దండ్రి విశ్రవసుండు. తల్లి కైకేసి. వీరికిఁ గుబేరుం డను నింకొక సోదరుండు కలఁడు. విశ్రవసుండు భార్యయగు కైకేసితో "రావణ కుంభకర్ణులు భయంకరు లగు రాక్షసు లయ్యెదరు. విభీషణుండు ధార్మికుం డగు" నని పూర్వమే చెప్పియుండెను. అట్లే వా రాజన్మాంతము ప్రవర్తించుచుండిరి.

రావణ కుంభకర్ణులు పెట్టు బాధలం బ్రజలు సహింపఁజాలకుండెడివారు. వీరి యిరువురిలోఁ గుంభకర్ణుండు మహాభయంకరుండు. కైకేసి కుబేరునిం జూపి "రావణా! చూడు వాఁ డెంత యోగ్యుఁడో! నీ విట్టయితి వెందుల?" అని ఖేదోపాయంబునం దనయుని మందలింపఁ, "దల్లీ! నేనంతకన్నను మంచివాఁడ నయ్యెదం జూడు" మని యతండు మాఱు పలికి

కుంభకర్ణ విభీషణసమేతంబుగా దపంబు సేయ మొదలు
పెట్టెను. పదివేల సంవత్సరంబులు విరించిం గుఱించి తపంబు
సేయ నతండు సంతుష్టాంతరంగుడై సాక్షాత్కరించి
"రావణా! నీ తపస్సున కానందించితి. వరంబు గోరుకొను
మొసంగెద"నని యనుగ్రహించె. "దేవా! నాకుం జావు లేని
వరంబు బ్రసాదింపు"మని రావణుండు వేడికొనియె. అంతటం
బితామహుండు "నీకు నే నా వరం బీయంజాల; మఱియొండు
వరంబు వేడుకొ"మ్మనియె. "హిరణ్యగర్భా! అటులేని, సర్వ
యక్ష రాక్షస దేవతాగణంబు నన్నుం జంపకుండం బ్రసాదిం
పుము. నరులకు నితర జంతువులకు భయంబడువాఁడం గా"
నని రావణుండు మరలం బ్రార్థించె. "అట్లే యగుం గాక!
మఱియు నీవు నీ యిచ్చవచ్చిన వేషంబు ధరింపంజాలియుండు"
మని పరమేష్ఠి వాని ధన్యునిం జేసి, విభీషణు ప్రార్థన ననుసరించి
యతని కెల్లప్పుడును ధర్మంబునందు, నీశ్వరునియందు బుద్ధి
నిలుచునట్లును, అమరత్వంబు సిద్ధించునట్లును వరం బొసంగె.
సురజ్యేష్ఠుండు కుంభకర్ణు నొద్దకుం బోయి వరంబు లిచ్చు
తఱి దేవతలందఱుం గూడి "వానికి వరంబు లొసంగ వల
దని యతని వేడికొనిరి. ముందే యింద్రుం డప్సరోగణం
బును, భృత్యులను బంపి కుంభకర్ణ తపోభంగంబునకుం బ్రయ
త్నించి విఫలమనోరథుండై దేవహితంబుగ సరస్వతీదేవి
నుపదేశించి కుంభకర్ణునకు బుద్ధిమాంద్యంబు ఘటింపం
బ్రార్థించె. సరస్వతియు ననువర్తించెను. బ్రహ్మ "వరంబు
వేడు"మని యడుగ "నాకెప్పుడును నిద్రయ కావలయు"

నని కుంభకర్ణుండు గోరుకొనియె. వాఁడు 'నిర్దయు' గోరం బోయి సరస్వతి తంత్రంబువలన 'నిద్రయు' కావలయు ననియె. అంతట లోకేశుండు తన కట్టులె వరంబు ప్రసాదింప నప్పటి నుండియు వాఁడు నిద్రాదేవి తల కెక్కఁ దొడఁగిన మూఁడ నొడ లెఱుంగక పడియుండెడివాఁడు. అట్లు గాఢనిద్రా పరవశుండై యున్న కుంభకర్ణుని లేపుటకై రావణాజ్ఞాతులైన క్రవ్యాదులు వెడలిరి. ఒక పర్వత గుహాంతరంబు కుంభకర్ణుని నివాసస్థలము. అది యోజనైక విస్తీర్ణము. హేమమయ పర్యంకంబున నిద్రించుచున్న యతనిని మేలు కొలుపుటకై వారు సహస్ర గజంబులచేతను, సహస్రహయం బుల చేతను త్రొక్కించిరి. శంఖనాదంబులను, భేరీభాంకారం బులను గావించిరి. శరీరంబునఁ జందనం బలందిరి. ధూపంబున గుహాయంతయు నిండి ఘుమ్మనునట్లు చేసిరి. అంతటఁ దన శరీరము నెవ్వరో నెమ్మదిగ నొత్తుచున్నట్లు స్ఫురింప వాఁడు కొంచెము ముత్తిగిలి కనులు తెఱచెను. నిద్ర లేచునప్పటికి కుంభకర్ణుండు మిక్కిలి యాఁకొనియుండు నని గ్రహించి వానియొద్ద ననేక జంతువులను, రక్తకలశంబులను నుంచి వాఁడు లేచిన వెంటనే వానికా యాహార పదార్థంబులం జూపి రాక్షసులు దూరంబుగఁ దొలంగి నిలిచిరి. వాఁడన్నిటిం భక్షించి "మీరందఱు నిట్లేతెంచి నన్నుం బ్రబోధించుటకుఁ గారణంబే?"మని యడిగె. అంత రాక్షసులు "నరవానరులు వచ్చి లంకాపురంబు ధ్వంసంబు చేయుచున్నా" రని చెప్పిరి. "ఇప్పుడే నేనా నరవానరులం జంపెద"నని కుంభకర్ణుండు

పయనం బయ్యె. "అయ్యా! ముందుగ మీా యన్నను సందర్శించి తరువాత యుద్ధంబునకుం బొం"దని రాక్షసులు విన్నవించిరి. కుంభకర్ణుండు రావణుని దగ్గఱకుం బయలుదేఱె. వానిని వానరవీరు లందఱు జూచి "ఆహా! ఇది యేదో పర్వతంబు నడచుచున్నట్లు లున్నది. ఆకృతియు వికారంబుగ నున్న" దని భయంపడి నలుదెసలకుం బరువులెత్తిరి. కొందఱు శ్రీరాముని మఱుంగు చేరిరి. మఱికొందఱెచ్చటికో పాఱి పోయిరి. శ్రీరాముండు విభీషణుం జూచి "వీఁడు రాక్షసుండా లేక రాక్షసియా?" యని ప్రశ్నించె. అతండు తన యన్న యగు కుంభకర్ణుని చరిత్రం బంతయు శ్రీరామున కెఱింగించెను. అంత శ్రీరాముండు వానరుల నందఱ నత్యంత జాగరూకతతో నుండుఁడని హెచ్చరించెను. కుంభకర్ణుండు దైత్యవల్లభుని యంతికంబునకుం జని "మహారాజా! నన్నేందులకు లేపితి?" అని ప్రశ్నించెను. "తమ్ముఁడా! నీ కెల్లప్పుడు నిద్రయే కాని మఱేమియుం దెలియదు. లంక పొంకం బణంగినది. రక్షోవీరు లందఱు రామశరానలంబునం బడి నశించిరి. ఇపుడు లంకాపురంబున వీరులే కాన్పింపకున్నారు. అందువలన నిన్ను లేపితిమి. నీవు శత్రువులం జంపిన మన ప్రాణంబులు నిలువఁగల"వని రావణుండు నిట్టూర్పు నిగిడ్చె. "అన్నా! నీవు దూర మాలోచింప కింతటి చేటు చేఁజేతఁ దెచ్చుకొంటివి. ఎందఱెంత యుపదేశించినను చెవిం బెట్టవైతివి. విభీషణుండు చెప్పిన రీతిం జేసిన మన కీ యాపద సంభవింపదు గదా!" యని కుంభకర్ణుండు రావణునకు హితం బుపదేశింపఁ జూచె. అంతట రావణుండు

క్రుద్ధుండై "నీ కీ యధిక ప్రసంగ మేటికి? అగ్రజ గౌరవంబు గలదేని నా కార్యంబు సిద్ధింపఁ జేయుము. లేదేని, నాకు బుద్ధి చెప్పవా రీ భువిలో లేరని నన్ను నిద్దురనుండి లేపితి ననుకొనకుము. పోపొమ్ము, నిద్దురం బొమ్మని సోదరుం దిరస్కరించె. "అన్నా! మంచి దని భావించిన విషయంబు నీ కెఱింగించితి. అదియుం దప్పని క్షమింపుము. ఎట్లైన నీ నిమిత్తంబు సమరం బొనర్తు" నని కుంభకర్ణుండు సోదరప్రీతిని వెల్లడించె. అసురేశ్వరుం డెంతయు సంతసించి తమ్ముని యుద్ధమ్మునకుం బురికొల్పెను. కుంభకర్ణుండు సమరరంగంబునకు రా వేగమే క్షుద్రవానర బలం బంతయు భయంబునం బాఱి పోయెను. వానరవీరులగు హనుమదాదులు ఘోరంబుగఁ బోరిరి. హనుమంతుండు పర్వతశిఖరంబుల నతని మొత్తి మూర్ఛితునిం గావించెను. శరభుండు, నీలుండు మున్నగు వానరు లెన్ని కఠిన బాధలం బెట్టినను వాని కేమియుం గష్టంబు దోఁపదయ్యె. వేలకొలంది వానరు లొక్కసారి త న్నెదిరింప వాఁ డెంత మాత్రము లక్ష్యపెట్టక యొక్కొక్కనిం బట్టి వాతం బెట్టుకొన మొదలు వెట్టెను. పెక్కురు వానరులు కుంభకర్ణుని నోటినుండియు, నాసాపుటాబులనుండియు, గర్ణరంధ్రంబులనుండియు వెలువడం జొచ్చిరి. అంగదుండు తనతో ఘోరంబుగఁ బ్రథనం బొనరించి తన్ను సొమ్మసిలఁ జేసినను వాఁ డది సరకుసేయక యంగదుండు మూర్ఛ మునుంగున ట్లొక తన్నుం దన్నెను. అంగదుండు స్మారకము దప్పి పడుటం గాంచి సుగ్రీవుండు పర్వతపాణియై

కుంభకర్ణునితో యుద్ధంబు సేయ నుపక్రమించెను. తన వలన మూర్ఛితుండైన సుగ్రీవునిఁ గుంభకర్ణుఁడు పుర మధ్యంబునకుం గొనిపోయెను. లంకాపురంబు ప్రవేశింపఁగనే సుగ్రీవుఁడు స్మృతి నంది కుంభకర్ణు నవమానింపఁ దలంచి తన హస్తద్వయంబున వాని కర్ణద్వయంబును, దంతంబుల నాసికను, పాదంబులఁ జర్మంబును నూడునట్లు మెలిపి నలిపి కొఱికి బఱికివైచెను. అంతటఁ గుంభకర్ణుండు రోదనధ్వానంబులు మిన్నుముట్ట సుగ్రీవునిం గ్రిందఁ బడవైచి కొట్టెను. వానిచే వ్రేటువడి సుగ్రీవుండు రామునియొద్దకుం బరువిడి యేతెంచెను. మొదలే కుంభకర్ణుండు వికృత స్వరూపుఁడు; ఇపుడు కర్ణనాసికావిహీనుం డగుటం జేసి మఱింత కురూపి యయ్యె. అతఁ డా యంగచ్ఛేదనబాధ కోరువంజాలక కోపంబు రూపూనినట్లు వానరులనే కాక కంటఁబడిన రాక్షసులం గూడ మ్రింగ నారంభించెను. ఇది వానరుల భయంబు నినుమడించెను. లక్ష్మణుండు కుంభకర్ణునితో యుద్ధంబు సేయఁబోవ నతండు "లక్ష్మణా! నీవు పసివాఁడవు. నీధైర్యంబునకు మెచ్చితిని. నేను శ్రీరామునితో యుద్ధంబు సేసి వానిం జంప నిశ్చయించుకొంటి" నని రాముని కడకుం బోయె. అతండు కుంభకర్ణుని కరంబు నొక్క శరంబునం దెగవేసె. కుంభకర్ణుండు ప్రళయపర్జన్యుఁడుంబోలె గర్జించుచు నొక తాళవృక్షంబును దెచ్చి యొంటిచేతితోడనే పోరాడంజొచ్చె. శ్రీరాముఁ డా హస్తముం గూడ మఱియొక యస్త్రంబున ఖండించెను. నిరస్త హస్తుం డయ్యుం గుంభకర్ణుం డమిత పరాక్రమంబున శ్రీరా

మునిం జంప నుంకించె. అంత నతండు కుంభకర్ణుని పాదం బులం ద్వితీయగతిం దెగనఱికె. కరచరణంబులం గోల్పోయి యుం గుంభకర్ణుండు మొఱ్ఱనుంబోలె నోరు దెఱచుకొని రఘుకుల పుంగవుని మ్రింగుటకై తిరిగి తిరుగ వచ్చుచుం బోయె సంఖ్యాతీతంబులగు సాయకంబులం బ్రయోగించి శ్రీరాముండు కుంభకర్ణుని వక్త్రముం గప్పివుచ్చి యైంద్రా స్త్రంబున వాని శిరంబు భిన్నం బొనరించె. కుంభకర్ణుం డీల్గె నని రాక్షసులు భయభ్రాంతులై యాక్రందింపసాగిరి. అంత దేవతలు, మునులు, గంధర్వులు మితిమీఱిన యానందంబున మునింగి యాకసంబు నుండి కోలాహలంబు నొనర్చుచుం బుష్పవర్షంబు గురియించిరి. లంకేశ్వరుండు సోదర మరణ వార్త నాలించి మూర్ఛిల్లె.

కొంత తడవునకు రావణుండు సస్పృహుండై రోదసీ కుహరంబు ఎదుర రోదనంబు సేయుచు “అహా! నేనజ్ఞానినై నిద్దుర వోవుచున్న పెద్ద తమ్ముని లేపి వైరివర్గంబుకడ కంపి పెద్ద నిద్దుర జెందించితిని. విభీషణు నవమానపఱచితిని. ఇందు లకుం దగిన శిక్ష యనుభవించుచున్నాఁడను. నా సర్వస్వము నశించిన” దని మరల నోడ లెఱుంగని దుఃఖంబున నేలపైఁ బడియె. అతని దుఃఖంబు చూచి సహింపఁజాలక యతని పుత్రులగు నతికాయ, త్రిశిర, దేవాంతక, నరాంతక ప్రము ఖులు “రామలక్ష్మణులం జంపెద” మని పొలికలనికి బలు వడిం జనిరి. వారు ప్రప్రథమంబున జిన్న చిన్న వానరుల ననేకులం దెగటార్చిరి. కాని యంగద, నీల, హనుమదాదులు

మార్కొనినతోడనే యతికాయుండు తక్క దక్కిన యందఱు మృతిం జెందిరి. అతికాయుండు తపః ప్రభావంబునం జేసి బ్రహ్మవలన ననేకాస్త్రంబుల నొకరథంబును సంపాదించియున్న వాఁడు. వానిం జంపుట వానరుల కసాధ్యంబయ్యె. కాని, లక్ష్మణుని యస్త్రకౌశలంబె చవి చూచి నిమిషమాత్రంబున నతికాయుండును యమపురంబుం బ్రవేశించె. పిదప నింద్రజిత్తు మరల యుద్ధసన్నద్ధుఁ డయ్యె. తొల్లింటి విధంబుననే వాఁ డగోచరుండై మేఘమధ్యంబునుండి బాణంబు లేయుటవలన హనుమద్విభీషణులు దక్కఁ దక్కిన వానరు లందఱు మూర్ఛిల్లి నేలం గూలిరి. అనంతరము రామలక్ష్మణులు పెద్దయుం బ్రొద్దు యుద్ధంబు సలిపి తుదకుఁ దాళఁజాలక తామును మూర్ఛిల్లిరి. కోట్లకొలంది బడియున్న వనచరులలో నెవ్వ రెక్కడ నున్నదియుం దెలియదయ్యె. హనుమద్విభీషణు లన్వేషించుచుం బోవుచుండ జాంబవంతుండు ప్రాణంబులతో నున్నట్టు కాన్పించెను. విభీషణుండంత జాంబవంతునిం జూచి "నీవు బ్రతికియున్నాఁడవు కదా?" యని హెచ్చరించె. "నేత్రకోణంబుల బాణంబులు నాటినవి. ఏమియుం గాన్పించుట లేదు. స్వరంబుంబట్టి నీవు విభీషణుండవుగాఁ దలంచెద" నని ప్రత్యుత్తరం బిచ్చి "పవనపుత్రుండు జీవించియున్నాఁడా?" యని జాంబవంతుం డాతురుండై యడిగె. "నీవు రామలక్ష్మణుల కుశలంబు సైత మడుగక హనుమంతుని క్షేమంబు మాత్ర మేదుల కడుగుచున్నాఁడ?" వని విభీషణుండు ప్రశ్నించెను. "హనుమంతుండు బ్రతికియున్న మన కేమియు భయం బుండ

ము. లేనినాఁడు మన మేమియుం జేయఁజాల" మని యతఁడు ప్రత్యుత్తరంబొసంగె. అంతభల్లూకవల్లభునకు వాతాత్మజుండు ప్రణమిల్లె. జాంబవంతుఁడు సంతోషించి "వత్సా! నీవు దక్క నింకొక్కఁడే మహాకార్యంబు ఘటింపఁజాలఁడు. హిమవత్పర్వతప్రాంతంబున ఋషభ కైలాస పర్వతంబులున్నవి. వాని నడుమ నోషధీపర్వతంబు గలదు. దానిపై విశల్యకరణి సంధానకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి యను నాలుగు విధంబు లగు నోషధులు గలవు. నీవు పోయి వానిని శీఘ్రంబుగఁ దీసికొని ర"మ్మని హెచ్చరించెను. అది వినినంతనే హనుమంతుం డతిత్వరితంబుగ నా యోషధులం దెచ్చుటకై బైలు దేఱెను. హనుమంతుని కా పర్వతముకడ కేగుట యెంతపని! అతండు పర్వతము సమీపించునపు డా యోషధులు చిత్రవర్ణాంచిత పత్రంబులం బ్రకాశించుచు నతనికిం గన్నుల పండువుం గూర్చెఁ గాని, దరి కరిగినంతనే యయ్యవి కాన్పింపవయ్యె. అంత హనుమంతుం డాగ్రహించి పర్వతంబునే పెకలించి తెచ్చెను. మృతప్రాయులుగాఁ బడియున్న తమ కా యోషధీ ద్రవ్యంబులం బ్రయోగింపక మున్న వాని పరిమళంబు నాఘ్రాణించుటంజేసి రామ, లక్ష్మణ సమేతము వా రెల్ల రప్పుడే సుఖ నిద్రనుండి లేచినట్లు ప్రవర్తించిరి. యుద్ధరంగంబునం బడిన వానరులే లేచిరి కాని రాక్షసు లెవ్వరును లేవ లేదు. రాక్షసుల కళేబరంబులు సమర రంగంబున నున్నచో వనచరులు వీక్షించుట వలన నవమానంబగు నని యెంచి రాక్షసులు తమవారి కళేబరంబుల

నెత్తి సముద్రింబునం బాఱవైచిరి. పర్వతమువలని కార్యంబు నెఱవేఱఁగనే హనుమంతుండు దాని నెత్తికొని పోయి యథా స్థానముం జేర్చి మరలివచ్చెను. మఱునాఁడు సంధ్యాసమయం బున వానరులు కొందఱు లంకాపురంబుం బ్రవేశించి దానిం గాల్పఁ దొరఁకొనిరి. ఒక వంక నగ్నిహోత్రుండు లంకం దహించుచుండ, ఇంకొక వంక వానరబలంబులు వైరిసేనల బలంబున నెదుర్కొని పోరాడఁ జొచ్చెను. పెక్కురు రక్కసు లుక్కడఁగి సుగ్రీవుఁడు గాంచి కుంభ నికుంభులు కుద్ధులై హనుమత్సుగ్రీవుల మార్కొని ఘోరంబుగఁ బోరాడిరి. కాని, తుదకు వారును మడిసిరి. ఇఁక నింద్రజిత్తు దక్క లంకా పురంబున వీరుం డెవ్వఁడును లేడు. ఇంద్రజిత్తు యుద్ధ మెల్లరు నెఱింగినదియే. మబ్బుల మఱుంగునం జేరి పోరి యింద్రజిత్తు రామలక్ష్మణుల మిగుల బాధించియు జయింపలేక యెట్ట కేలకుం దన రథంబున నొక మాయాసీతం బెట్టుకొని వచ్చి యామె శిరోజంబులు చేతం బట్టుకొని వారియెదుట ఖడ్గంబున దాని కుత్తుక నుత్తరింప, కృత్రిమసీత "హా! రామా!" యని యఱచుచు మరణించెను. హనుమంతుం డది సీతాదేవియే యనుకొని సంతాప కోపంబులు మనంబునం బెనంగొన "ఓరీ! నీవు సీతాదేవిం జంపితివి. గాన నిన్నిప్పుడే యమపురంబున కనిపెద" నని వానిం దాఁకి భీషణంబుగ యుద్ధంబు సేయం దొడంగె. కాని, కొంత తడవున కతండు రణరంగవిముఖుండై మరలి "సీతాదేవి మృతినొందిన నిఁక యుద్ధం బెందునిమిత్తం" బని రామునితో నాలోచింప వచ్చెను. రామ లక్ష్మణులును

సీతయే మరణించె నని యెంచి దురంత దుఃఖాక్రాంతులై
యాక్రందించు చుండిరి. ఇఁక వారి నోదార్చువా రెవ్వరు ?
అంత విభీషణుం డేతెంచి "రామచంద్రా ! సీతాదేవిం జంపు
వారు కలరా ? ఏల దుఃఖించెదవు ? ఇంద్రజిత్తు చంపినది
మాయా సీత. వాఁ డిప్పుడు నికుంభిళ యజ్ఞంబు చేయు
చున్నాఁడు. ఆ యజ్ఞంబు చక్కఁగ నెఱవేఱిన వాని నెవ్వరు
నోడింపంజాలరు. జన్నంబు సమాప్తంబు కానియెడ వాఁడే
రణనిహతుం డగును. నిరంతరాయ సవన సమాప్తికై వాఁ
డిట్లు చేసి పోయె. వాని మఖంబు పరిసమాప్తి నొందక
మున్న మన మేగి దాని భగ్నంబు గావింపవలయు. ఈ ఘన
కార్యంబును లక్ష్మణుండే కాని మఱి యెవ్వరును సాధింప
నోపరు. చిరకాలము నిద్రాహారంబులు మానిన శూరునిచేఁ
దప్ప మఱి యెవ్వనిచే నతండు చావఁడు. అరణ్యావాసమునకు
వచ్చినది మొదలు లక్ష్మణుండు వివర్జిత నిద్రాహారుఁడై యున్న
వాఁడు కావున, సౌమిత్రియే వానిం బరిమార్పఁగలం" డని
విన్నవించె. వెంటనే లక్ష్మణుండు వానరసేనా పరివృతుండై
జన్నంబును బన్నం బొనరింప సన్నద్ధుండై గమ్యస్థానముం
జేరి పరాక్రమంబు మెఱయ దానవ శ్రేణిపై బాణపరం
పరలు గురియింపఁజొచ్చె. వారుం గపిసేనపై నానావిధాయు
ధంబులం బఱపిరి. కాని, ప్రయోజనంబు లేకపోయె. నిష్ఠా
గరిష్ఠుండై యాగంబు సేయుచున్న మేఘనాథుం డీర్ష్యచే
సవనంబును మాని జవంబున రథం బెక్కి యుద్ధంబునకు
వచ్చెను. ఇంద్రజిత్తు రథంబునం దుండియు లక్ష్మణుం డాంజ

నేయుని భుజంబులపై నుండియు ఘోరంబుగఁ బోరుసలిపిరి. శౌర్యమునం దిద్దఱు నుద్దియే. వారద్భుతాస్త్రంబుల నొండొరులపైఁ బ్రయోగించు కొనుచుండిరి. పరస్పరాస్త్రఘాతంబున నిరువురి శరీరంబుల నుండియు రుధిరంబు ప్రవహింపసాగెను. సౌమిత్రి మేఘనాథుని రథంబును ధ్వంసంబు సేసినపు డెల్ల నతండు మేఘమధ్యంబునుండి కొండొక క్రొత్త రథంబుం దెచ్చుకొన నారంభించెను. లక్ష్మణుం డింద్రాస్త్రంబుతో మేఘనాథుని బాణంబును భేదింప సంసిద్ధుండు కావేగమే, యింద్రుం డా యస్త్రంబుతోడనే యసురుల నెల్ల దేవాసుర యుద్ధంబునం జంపిన కతంబున, రాక్షసు లందఱు భీతిల్లఁ జొచ్చిరి.

ఇపుడు లక్ష్మణుం డా యింద్రాస్త్రంబుతోనే యింద్రజిత్తును యమాలయంబునకుఁ బాఱఁదోలె. అంత, దేవతలతిమోదంబున విరుల వానం గురిసిరి. దివ్యదుందుభులు మ్రోఁగె. కిన్నరగంధర్వ గీర్వాణవరులు లక్ష్మణు నెంతయు సన్నుతించిరి. ఇట్లు విజేతయై లక్ష్మణుండు సీతాపతిం జేరినంతనె యతండు గడుంగడు సంతసమునఁ దమ్మునిం గౌఁగిలించుకొని మూర్ధ మాఘ్రాణించి "ప్రియసోదరా! అతి దుష్కరం బగు కార్యంబును నీ విపు డొనర్చితి" వని కొనియాడె.

ఇంద్రజిత్తు మృతినొందెనని విని రావణుండు మిక్కిలి పొక్కి నగరంతయుం బ్రతిధ్వనింప రోదనంబు సేయుచుఁ

క్రోధంబున మైమఱచి 'సీతను నిజంబుగ ఖండించెద' నని యశోకవనంబున కరిగి యామెను నఱక సమకట్టి యట్టహాసంబు సేసె. మంత్రిపుంగవుండు "సీతను జంపుట పాడిగా" దని సౌమ్యవాక్యంబులు పలికి వాని నుపశమింపఁ జేసెను. అంత రావణుండు రాక్షసుల నెల్లరం బిలిచి "రామునిం జంపి వేయుఁడు. మీవలనం గాదేని నేనే రేపకడ నతనిం బోకార్చెద" నని తీవ్రంబుగఁ బలికె. వారందఱు యుద్ధంబునకుం బోయిరి. కోదండరాముని కోపాగ్నికిం జాలమంది శలభంబులైరి. తక్కుంగల రక్కసులు మిక్కిలి భయంబునం బలాయితులైరి.

ఇక లంకాపురంబునం దెవ్వరును వీరులు లేకుండుటం జేసి లంకేశ్వరుండు సంగ్రామ విజయంబునకై హోమంబు సేయ సమకట్టెను ఈ హోమంబు పూర్తి యయినచో, రావణు నెవ్వరుం జంపఁజాలరు. అయ్యది విభీషణుం డెఱింగి యజ్ఞభంగం బొనరింప వానర వీరులం బంపెను. నవసస్థంబు విభీషణపత్ని యగు సరమవలనం దెలిసికొని వారచ్చటికిం జని యెన్ని విధంబులఁ దన్ను మఖవిముఖునిం జేయఁ బ్రయత్నించినను దశముఖుండు నంచలింపక తదేకనిష్ఠ నుండెను. అది గాంచి వారు మండోదరిని బఱబఱ నీడ్చుకొని వచ్చి రావణు కట్టెదుట బహువిధంబుల హింసింపఁజొచ్చిరి. అప్పుడామె యార్తనాదంబుతో రావణుం జీర, నతం డాగ్రహోదగ్రుండై యజ్ఞదీక్షం బరిత్యజించి యుద్ధంబునకై వెలువెడలెను.

అంత రామరావణులకు ద్వంద్వయుద్ధంబు పొసంగె. రాముండు ధీరుండై దశకంఠుని కంఠంబు లెన్ని సారులు ఖండించినను వెండియు నవి మొలవ నారంభించెను. ఒక్క రాముండె కాక లక్ష్మణాదు లందఱు రావణుం దలపడిరి. శ్రీరాముని బాణంబులకుం బ్రాణంబులను దొట్రిల్ల రావణుండు నిస్పృహం జెంది కొంత తడవున కిసుమంత దెప్పిఱిలి మరల నతనితో సమరంబు సేయ సమకట్టెను.

అంతట, స్వర్గంబు నుండి మణిగణఖచితం బగు రథంబును దేవేంద్రుండు శ్రీరామచంద్రుని కొఱ కంపెను. దాని రథ్యంబు లెల్ల నీలవర్ణంబునం దేజరిల్లుచుండె. సారథి శరీరంబున స్వర్ణ భూషణంబులుం గంఠంబున ముత్తెంపుసరులుం బ్రకాశించుచుండె. మాతలి పేరం బరఁగు నతండు క్షితీశ్వరుం డగు శ్రీరామచంద్రునకు జోహారొనరించి "ఇంద్రుఁ డీ రథంబును శరకవచనంబులను మీకొఱ కంపె" నని వినమ్రుండై విన్నవించె. రాముఁ డా దివ్యరథంబు నధిరోహించి రావణునితో హోరాహోరిం బోరం గడంగె. శ్రీరాముని యుద్ధకౌశలంబులం గాంచి దైత్యనాథుండు తన ప్రాణంబులు పోవు నని భయవిహ్వలుండై యుండె. అద్వితీయం బగు నీ రామరావణయుద్ధంబును దేవత లాకసంబునుండి చూడం దొడంగిరి. రావణుండు 'దీనితో శ్రీరాముఁడు చచ్చుంగాక' యని యొక తీవ్రాస్త్రంబును విడిచెం గాని యది విఫలం బయ్యె. రాముఁ డా రావణుండు మూర్ఛిల్లున ట్లనేకసాయకంబు లేసి యమోఘాస్త్ర ప్రయోగంబున వాని శిరంబు లెన్ని పర్యా

యంబులు దున్ఱించిన నవి తున్ఱించుటయే తడవుగ మరల మొలవం జొచ్చె. అంతట రాముఁడు విషణ్ణుండై విభీషణుం జూచి "వీనికిం దల లిట్లు మొలచుటకుం గారణం బే?" మని ప్రశ్నించెను. "అతని నాభియం దమృతకలశం బున్నది. దానివలన నతండు చావఁ" డని విభీషణుఁడు ప్రత్యుత్తరం బొసంగె. వెంటనే రామచంద్రుండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి రావణుని వక్షస్థలంబు మొదలు నాభి వఱకు భేదించెను. అంతట భూమి కంపించెను. బ్రహ్మాస్త్ర ప్రభావంబునకు బృందారకులుం గంపితు లైరి. రావణుఁడు మరణంబు నొందె నని నిలింపులు గుంపులు గూడి యానందంబునం గుసుమవర్షంబు గురియించిరి. వానరసేనా సమూహంబు సముత్సాహంబున జయఘోషణంబులు గావించె. హతశేషు లైన రాక్షసులు కాందిశీకు లైరి. అవమానింపఁబడిన విభీషణుండును సోదర మరణంబునకు దుఃఖించె. అంతఃపుర కాంతా జనరోదనంబు విని పరితపించుచు, రాముఁడు వారి నూఱడించి రావణునకు యథావిధిగఁ జరమకర్మంబు నడప విభీషణు నియోగించి తన విజయంబు జానకీదేవికిం దెలుప నశోక వనంబునకు హనుమంతునిం బంపె.

సీత యశోక వనంబున నొక చెట్టుక్రింద మలిన వస్త్ర ధారిణియై శిరోజంబులు ముడువక చింతించుచుండెను. సుఖ దుఃఖములలో నేది విశేషించినను మనుజులకు వ్యాకులం బధికం బగు. "సుఖదుఃఖంబులతో నాకుం బని యే?" మను తెఱంగున నిశ్చేష్టురాలై యున్నట్లు సీత కాన్పించెను.

వాయుసూనుఁడు శ్రీరాముఁడు విజయలక్ష్మిం జేకొన్న శుభ
వార్తం జెప్పెను. తోడనే జానకి మిగుల నానందించి యట్టి
పరమశుభవార్తం జెప్పిన యాంజనేయున కేదేని బహుమతి
నీయ నభిలషించెం గాని యచ్చట కేమియుం గాన్పింప
దయ్యె. అందులకామె విచారించుచుండుటం గాంచి "అమ్మా
మీరు సంతుష్టిఁ జెందితిర దియె చాలు. మిమ్ము గష్ట
పెట్టిన రాక్షసస్త్రీల నందఱం జంపుట కనుజ్ఞ యిం" డని
హనుమంతుండు వేడికొనియె. సీతాదేవి యందులకు సమ్మ
తింపక తాను శ్రీరామచంద్రుని కడకుం జన బయనమయ్యె.
అంతఁ బురాంగనలు సీత యీరీతిగా నేగుట యుచితంబు
కాదని యామెకు బట్టాంబరంబుల, మణిభూషణంబుల నలంక
రించిరి సాలంకృతయైన సీత సోత్కంఠంబుగ శ్రీరాముని కడ
కేగి శోకానందబాష్పంబు లురల సవినయంబుగ నమస్క
రింప, నతండు నిర్దాక్షిణ్యుండై "ఓ యువతీ ! నీ వింత
కాలంబు పగతు నింట నుంటివి. నీవు పవిత్రచరిత్ర వని
యెట్లు నమ్మఁగలను ? రావణునకుం దగిన శిక్ష యొనరించితిం
గాన నీవిఁక నీవారిం బో" మని యతినిష్ఠురంబుగ నామెను
నిరాకరించె. ఈ కర్ణకఠోరవాక్యంబులు వినినంతనె సీతాదేవి
యవస్థ దుస్సహం బయ్యెను. మనోదుఃఖంబు పొంగి పొరలి
కన్నీరై పాఱ, సీతాదేవి మఱఁదిం జూచి "నేను బ్రతికి
యేమి ప్రయోజనంబు ? లక్ష్మణా ! అగ్నిం బ్రజ్వలింపఁ జేయు
ము. నేను దానంబడి ప్రాణంబులు విడిచెద" ననియె. లక్ష్మ
ణుండు క్రోధదుఃఖములతోఁ జితి నేర్పఱచెను. లోకమందలి
సుఖం బంతయు సీతాదేవి కర్పించినను అమె సుగుణంబుల

కది తగిన బహుళ్కృతి గానేరదు. కట్టా ! అట్టి సీతాదేవి కిపు డెట్టి యిక్కట్టు సంభవించినది.

ఏమీ యీయాశ్చర్యము ! సీతాదేవి యగ్నిం బ్రవేశింప, నామె యవయవంబు లెవ్వియు వైవర్ణ్యంబు నైన నొందకుండె. అంత నగ్ని దేవుం డామె నెత్తుకొని బయల్వడెను. అమె పరిభాతిసమయ సూర్యుంబోలి తేజస్సువం బ్రకాశించుచుండెను. అగ్ని దేవుండామెను శ్రీరాముని కర్పించి 'సీత నిర్దోషురా' లని ఘుటాపథంబుగ వక్కాణించె. అప్పుడు శ్రీరాముం డామె నానందముగం గైకొనెను. స్వర్గమునుండి దేవతలు శ్రీరామునిం జూచుట కేతెంచిరి. వారితో దశరథుండు నరుదెంచె. దేవతలందఱు దశరథాత్మజుని మహిమముం బహుపరివిధంబులం బొగడం దొడంగిరి. వారటు పొగడి పొగడి తుదకు "వరంబు లనుగ్రహింతుము, కోరుకొ"మ్మనిరి. "పంచత్వంబు నొందిన వనచరు లందరు జీవించెదరుగాక!" యని శ్రీరాముండు కోరుకొనియె. సురవరు లట్ల యనుగ్రహించిరి. అంతట, శ్రీరాముండు సీతాలక్ష్మణసమేతుండై దశరథునకుం బ్రణామం బాచరించె. అతం డందఱ నాశీర్వదించి మరల స్వర్గమునకుం బోయెను. విభీషణుండు శ్రీరాముని "లంక సింకొక దినంబేని యుండు"డని బ్రతిమాలుకొనియె. భరతుండు తన రాకకై యెదురుచూచుచుండు నని రాముండు మఱుసటి దినంబునసే పుష్పకవిమానమ్ము నధిరోహించి పరివారసహితుం డగు విభీషణునితోడను హనుమత్సుగ్రీవాది సకల వానరవీరులతోడను నయోధ్యకుం బ్రయాణ మయ్యెను. సీతాదేవి యభీష్టంబు చొప్పున నతండు కిష్కింధకుం జని

వానర స్త్రీలం గూడ నయోధ్యకుం దోడ్కొని పోయెను. అట్టు
శ్రీరాముఁడు సకల పరివారముతోడం జని చని భరద్వాజా
శ్రమంబుం జేరి భరతునకుం దన రాకం దెలుపు మని పవన
పుత్త్రుం బంపెను. హనుమంతుం డరిగి భరతునకు శ్రీరామా
గమంబు నివేదింప వెంటనే యతండు సంతోషపరవశుండై
శుభోదంతం బంతయు హనుమంతుని వలన వివరంబుగ వినుచు
శ్రీరామాదుల కెదురేగెను.

ఈ శుభసందేశం బయోధ్యాపురం బెల్లెడం బెల్లుగ
వ్యాపించెను. పదునాల్గు సంవత్సరముల నుండి నిద్రాహారం
బులు యథాపూర్వంబు గైకొనక శ్రీరామచంద్రుని కొఱకు
విచారించుచున్న పురజను లందఱు నతని యయోధ్యాభిగమ
నంబును గూర్చి విన్నంతనె యమందానంద మంది చిత్రాం
రాభరణభూషితులై తమతమ గృహంబులం గడుం జమ
త్కారంబుగ నలంకరించి పురం బంతయుం గలకలలాడుచుం
డ న ట్లొనర్చి పురోపకంఠంబునకుం జని శ్రీరాముని కొఱకు
వీక్షించుచుండిరి. రాజమాతలుం బాలకు లెక్కి యెదురు
చనిరి. అంత శ్రీరామాదులు రా నందఱుం గలిసి మంగళ
వాద్యంబులు సెలంగ నగరుం బ్రవేశించిరి. అనంతరము సీతా
రాములకు మంగళస్నానంబులు చేయించి మహావైభవంబునం
బట్టాభిషేకసన్నాహంబు గావించిరి.

ఇన్ని సంవత్సరంబులుం బాదుకలనే మహారాజుగ
వించిన భరతుం డా పాదుకలను సర్వజనంబులు వినుతింప
రాముని పాదపద్మంబులకుం దొడిగెను. విధ్యుక్తప్రకారం

బుగ వసిష్ఠాదిమౌనివర్గంబు సకలపుణ్యనదీజలంబులఁ శ్రీరామ చంద్రు నభిషిక్తుని జేసె. దేవతలనేకాభరణంబులు కాను కలుగ నొసంగిరి. నరకిన్నరగరుడగంధర్వయక్షపన్నగ లోకంబులు సంతోషకలకలంబుల నడుమ స్తోత్రగానంబు లొనరించి శ్రీరాముఁ డయోధ్యాపురాధీశ్వరుండయ్యెనని చయ్యనఁదమ తమ లోకంబుల వెల్లడించిరి. శ్రీరామునిబోలు రాజేంద్రుండును సీతాదేవింబోలు సాధ్వీమతల్లియు నెచ్చటం గాన్పింపదు. శ్రీరాముని పరిపాలనంబున జగం బంతయు "రామరాజ్యం" బనం బ్రఖ్యాతి వహించె. లోకులు నిరామయులై సకల భాగ్యసంపన్నులై ధర్మమార్గతత్పరులై పరమోదారులై ప్రవర్తిల్లుచుండిరి. కోరినప్పుడ వారిదంబులు జలంబులను వహింరంబును మారుతంబులను ప్రభాకరుం డాతపంబును బ్రసాదించుచుండ, నయోధ్యాపురజనం బకమృత్యు భయంబు లేక విమసంతుసంతాపం బెరుంగక మూఁడు పూవులు నాలుకాయలుగ వనుదినప్రవర్ధమానసంపత్సమృద్ధిం బరమానందసాగరంబున నోలలాడుచుండెను. సవనకర్మంబుల బ్రా హ్మణులను దుష్టరాక్షస సంహారంబున మౌనిపుంగవుల నాదరప్రపత్తుల బంధుజాలంబును గోభూహిరణ్యాదానాదికంబుల విప్రవర్గంబును దయావిశేషంబున దాసజనంబులను దనుపుచు ధర్మపత్నియుం దమ్ములుం దన్ను నిరతంబు సేవించుచుండ నవక్రవిక్రమక్రమంబునం జక్రవర్తియై యర్కాన్వయంబు దీపింప శ్రీరామభద్రుండు నిర్నిద్రప్రభావంబున భూచక్రంబు బరిపాలించుచుండె.

సమాప్తము.

